# నెహ్రూ - సోషలిజం



ప్రచురణ
ప్రధానకార్యదర్శి
ఉత్తరాంధ్ర - బి.సి. సమాఖ్య
పెందుర్తి
విశాఖపట్నం (A.P)

నెహ్రూ సోషలిజం
NEHRU SOCIALISM

Written by

**Vangapandu Appalaswamy**
**Principal(Rtd)**

Correspondent
T. Subba Rami Reddy National Junior College
Prasanthi Nagar, Pendurthi
Visakhapatnam Dist, Andhra Pradesh

ప్రతులు 1000
ప్రచురణ 1999


**Published**
by
**General - Secretary**
**Utharandhra - B.C. Samakhya**
Pendurthi
Visakhapatnam, Andhra Pradesh

వెల రూ 10/-లు

# నెహ్రూ - సోషలిజం

## అంకితం
**(Dedicated)**

మన రాజ్య సభ సభ్యులు M.P.
రాష్ట్ర-పి.సి.సి. ఉపాధ్యక్షులు
ఉత్తరాంధ్ర కాంగ్రెస్ ఊపిరి

మకుటం లేని మహారాజా



ద్రోణం రాజు సత్యన్నారాయణ

ఇట్లు
ప్రజాకవి - వంగపండు అప్పలస్వామి
ప్రిన్సిపాల్ (Rtd)
పెందుర్తి - విశాఖపట్నం

# నెహ్రూ - సోషలిజం

ఇందులో



ప్రజాకవి- వంగపండు
పెందుర్తి - విశాఖ

# 1వ ప్రకరణం

## నెహ్రూ - సోషలిజం

**సోషలిష్టు తరహా సమాజ నిర్మాణం :-**

శ్రీకారం చుట్టి ప్రథమముగ, చరిత్రాత్మక-మద్రాసు ''ఆవడి'' కాంగ్రెస్ ప్లీనరీ సమావేశం ''సోషలిష్టు మార్కెట్ ఎకనమీకి'' ఆహ్వానం పలికింది. మన భారత దేశ మాజీ ప్రధాని, నవ భారత నిర్మాత, జవహర్‌లాల్ తన ఆర్థిక వ్యూహరచనకు కాంగ్రెస్ వర్కింగ్ కమిటి ఆమోదాన్ని 1955 లో మద్రాస్ ఆవడి కాంగ్రెస్ సమావేశంలో పొందగలిగారు.

పెట్టుబడిదారీ వ్యవస్థ పోకడల్ని కలిగిన అమెరికా ఆర్థిక వ్యవస్థను కాదని, సామ్యవాద ఆర్థిక వ్యవస్థగల సోవియట్ రష్యాను అనుసరించక, సోషలిజానికి కేపిటలిజానికి భిన్నమైన సోషలిష్టు తరహా సమాజ నిర్మాణానికి(Socialist pattern of society) తగిన కార్యాచరణ పథకాన్ని నెహ్రూ రూపొందించారు.

ప్రయివేటు రంగసంస్థలకు అనుమతినిస్తూనే, ప్రభుత్వరంగ సంస్థలకు అధిక ప్రాధాన్యతనిచ్చే మిశ్రమ ఆర్థిక వ్యవస్థకు(Mixed economy) రూపకల్పన జరిగింది.

భూసంస్కరణలను అమలుపరచ కాంగ్రెస్‌పార్టీ సిద్ధపడింది. శాస్త్ర సాంకేతిక రంగాలు, ప్రాధాన్యతలను సంతరించుకున్నవి. దేశాన్ని స్వావలంభన-స్వయం సమృద్ధి దిశగ-గాంధీజీ సిద్ధాంతాల నేపథ్యంలో నెహ్రూ తన ఆర్థిక సిద్ధాంతాల కార్యాచరణను అమల్లోకి తెచ్చారు. నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీ కమ్యూనిష్టుల సామ్యవాద విధానం ఒకటి కాదు. నెహ్రూజీ అలీనోద్యమాన్ని తటస్థ విదేశాంగ విధానానికి అనుకూలముగ జాతీయ సమైక్యతా పథం వైపు పయనించారు. జాతి అభివృద్ధిని అభ్యుదయాన్ని దృష్టిలో నిడుకొని పేదలు-శ్రామికులకు అనుకూలమైన సంక్షేమ ఆర్థిక విధానాల్ని చేపట్టారు.

ఒక వైపు దేశ ఉమ్మడి సంపదలకు ఊపిరినిడి, దేశ ఆర్థిక వ్యవస్థను చక్క దిద్దుతూ ప్రధాన పరిశ్రమలను-సంస్థలను జాతీయం చేస్తూ మరొక వైపు సంక్షేమ రాజ్యవిధానాల్ని ఎంతగానో ప్రోత్సహించారు నెహ్రూజీ.

**నెహ్రూ సోషలిష్టు సిద్ధాంతం వట్టి భూటకమా!**

ఆవడి కాంగ్రెస్ సదస్సులో చేసిన ఈ ఆర్థిక తీర్మానాన్ని ఉభయ కమ్యూనిష్టు పార్టీలు ఆనాడు నెహ్రూ సోషలిష్టు సిద్ధాంతం వట్టి భూటకమని కొట్టి పారేశాయి.

పేరే గాక అప్పట్లో వామపక్షాలతో పోల్చితే, బలహీనంగ ఉన్న స్వతంత్ర్య పార్టీ కూడ రాజగోపాలాచారీ నాయకత్వంలో, నెహ్రూ ప్రణాళిక ఆర్థిక విధానాన్ని ప్రభుత్వరంగ విధానాల్ని ఎంతగానో విమర్శించింది. నెహ్రూ భావాలు సిద్ధాంతాల్ని సుతరామూ అంగీకరించని రామ్మోనోహరలోహియ నెహ్రూ -సోషలిష్టు మార్కెట్ ఎకనమీని నాడు వ్యతిరేకించారు.

ఇక అప్పటి జన సంఘం-నేటి భా.జ.పా సంఘ పరివార్ అయితే నెహ్రూజీది తప్పుడు ఆర్థిక విధానమని ఎలుగెత్తి చాటింది. నెహ్రూజీ తన ఆర్థిక సిద్ధాంతాన్ని పణముగ పెట్టి ఎన్నికలలో దేశ ప్రజల తీర్పును కోరేవారు. దేశంలో జరిగిన ఎన్నో సాధారణ ఎన్నికలలో కాంగ్రెస్పార్టీ ఎన్నుకోబడుతూ వచ్చేది. అయితే ఈ గెలుపు కేవలం పార్టీగెలుపు కాదు నెహ్రూజీ ప్రతిపాదించిన ఆర్థికవిధానం ''సోషలిష్టు సమాజ పునర్నిర్మాణం గెలుపు''. దేశ ప్రజల అభివృద్ధికి అభ్యుదయానికి ఒక మలుపు. కాంగ్రెస్కు స్థిరమైన ఘనమైన కీర్తి ప్రతిష్టల్ని తెచ్చిపెట్టింది. ''నెహ్రూ సోషలిజమే.''

## ఫాల్టీ ఎకనమిక్ డైరక్షన్ నెహ్రూ సోషలిజమా!

నిన్న మొన్నటి వరకు-నెహ్రూజీది ఫాల్టీ ఎకనమిక్ డైరక్షన్(Fault Economic Direction) అని ఎలుగెత్తి చాటిన కొన్ని పార్టీలు నేడు రష్యాలో ఆర్థిక సంక్షోభం తలెత్తడంతో ఆసియన్ టైగర్ల(దేశాలు) ఆర్థిక వ్యవస్థ కుప్పకూలడంతో నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీ ప్రాధన్యత ఏమిటో తెలిసిరాగా, నేడు నోరు మెదపటానికి ఎవరూ దీనిని కాదనటానికి గాని సాహసించలేదు.

తత్త్వమున బుద్ధునివలె, నెహ్రూజీ-'' ఆర్థిక వ్యవస్థ'' అమలులో ''మధ్యేమార్గం'' అనుసరించారు. మానవ మేధస్సుకన్న మార్కెట్ శక్తులదే పై చేయి అన్న నెహ్రూజీ అంగీకరించే వారు కాదు. అలా అని మార్కెట్ శక్తులను పూర్తిగ రద్దుచేసి సర్వస్వతంత్ర్య కేంద్రీకృత నిరంకుశ ఆర్థిక వ్యవస్థను నెలకొల్పుటకు నెహ్రూ సుతారామూ అంగీకరించేవారు కాదు.

ఒక వైపు ''మార్కెట్ ఎకనమీ'' వేరొక వైపు సోషలిష్టు ప్రణాళిక విధానం. మార్కెట్కే అనుకూలించే విధానాలను అవలంభించుటకు లేదా ఆర్థిక వ్యవస్థను మార్కెట్ శాసించే స్థాయికి తీసికొని వెళ్లడం రెండింటిలోను ''సమభావం'' సమరీతిని నెహ్రూజీ ప్రోత్సహించారు.

## ''మధ్యేమార్గం'' నెహ్రూ ''సోషలిష్టు మార్కెట్'' ఎకనమీ :-

భారతదేశం నేటికి సామాజిక అసమానతలతో సతమతమౌతున్న దేశం ప్రజల ప్రయోజనాల్ని సిద్ధింపజేయనిదే ప్రజాస్వామ్య ప్రక్రియ సభాష్ అనిపించుకోదు. దేశ

దశ దిశా నిర్దేశనం చేయుటంలో ప్రభుత్వం ఎంతో జాగరకత వహించాలి. వ్యక్తుల స్వేచ్ఛా సమానత్వాల హక్కులను అవరోధంగా నిలచే విధానాల్ని చేపట్టరాదు. అలానే వ్యక్తుల ప్రతిభా సామర్థ్యాల్ని కించపరచే పద్దతులను తన దరికి రానీయకూడదు. అందుకు మధ్యేమార్గం నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీ మన దేశానికి శరణ్యం శిరోధార్యం.

నేటి మన దేశ ఆర్థిక వ్యవస్థలో గల వైఫల్యాలకు లోపాలకు నెహ్రూజీ ప్రవేశపెట్టిన సోషలిష్టు మార్కెట్ ఎకనమీ కారణమని అనటానికి లేదు. కారణం 1955 నుండి నాల్గు దశాబ్దాల పాటు పకడ్బందీగ కేంద్రంలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు ఏర్పడే వరకు నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీ ఘన విజయాల్ని దేశ స్థాయిలో సాధించినదనే చెప్పాలి. లేనిచో నవ భారత నిర్మాత మన నెహ్రూజీ అన్న మనం కాదనవలసి వస్తుంది. కంటికి కనిపించు దేశాభివృద్ధిని ఎలా కాదనగలం.

దేశం ఆహార రంగంలో పచ్చ విప్లవం వలన-స్వయం సమృద్ధిని సాధించగలిగింది. దేశ భారీపరిశ్రమల రంగంలో అనూహ్యామైన ఆర్థిక పురోగతి లభించినది. ఔత్సాహిక పారిశ్రామిక వేత్త లెందరో ముందుకు వచ్చి చిన్న తరహా పరిశ్రమల రంగాన్ని ఎంతగానో విస్తరింప జేసారు. నిజానికి నెహ్రూ ఆర్థిక విధానం. ఒక శక్తి వంతమైన ప్రజాస్వామ్య వ్యవస్థను నెలకొల్పుకొనేందుకు మనకు దోహదపడింది. కాలపరీక్షను తట్టుకొనే ఎన్నికల వ్యవస్థను మనకు తెచ్చి పెట్టింది. స్వతంత్ర్యమైన న్యాయవ్యవస్థకు పునాదుల్ని సమకూర్చింది. స్వేచ్ఛాయుత పత్రికా వ్యవస్థకు ప్రాణం పోసి వ్యక్తుల పరిపూర్ణ వ్యక్తిత్వ బలాల నిర్మాణానికి తోడ్పడింది.

**''నాయకమ్మన్యులు'' ప్రధాన బాధ్యులు :**

దరిమిలాకాలంలో - భారత్‌లో - నెహ్రూజీ ఆర్థిక విధానాలను గండికొట్టి సాహసించే కాంగ్రెసేతర ప్రభుత్వాల వలన మన దేశ ఆర్థిక వ్యవస్థ కొన్ని వైఫల్యాల్ని లోపాల్ని మరల సంతరించుకుంది. ఇందుకు నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీలో గల లోటుపాట్లేమి గాక నెహ్రూర్థిక వ్యూహాన్ని తప్పుగ భావిస్తూ సరిగ్గా దీనిని అమలు పరచకపోవడమే కారణంగ నిలుస్తుంది. ఇందువలన తప్పు పట్టాల్సింది. నెహ్రూజీ ఆర్థిక విధానాన్ని కాదు. దీనిని సరిగ అమలుపరచని, పరచలేని ఈ ఆర్థిక విధానం నుండి పైదొలగ సాహసించు రాజకీయ సామాజిక రంగాలలోని, ''నాయకమ్మన్యులు'' ప్రధాన బాధ్యులు-కాగలరు.

## 2వ ప్రకరణం
## ఇందిర 20 సూత్రాల ఆర్థిక విధానాలు

భారతీయ ఆర్థికవ్యవస్థలో 'సమృద్ధికి' ప్రయత్నాలు 1947లోనే దేశ స్వాతంత్ర్యంతో ప్రారంభమైనవి. దేశం స్వయం సంపూర్ణ సాధనకు స్వావలంబనకు గట్టి పునాదులేర్పడినవి.

1965 నుండి 1981 వరకు నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీకి ఇందిరాగాంధీ సమగ్రమైన రూపురేఖలనిస్తూ 20 సూత్రాల ఆర్థిక ప్రణాళికను ప్రకటించడమే గాక జాతీయకరణను చేపట్టి దేశ ఉమ్మడి సంపదలకు పెంపునకు స్వర్ణయుగాన్ని సృష్టించారు.

1981 నుండి 1984 వరకు రాజీవ్‌గాంధీ-నెహ్రూ ఇందిర ఆర్థిక విధానలనే గట్టిగ అమలుపరచ ప్రయత్నిస్తూ బలమైన పంచాయితీ రాజ్ వ్యవస్థకు రాజ్యాంగ ప్రాతిపదికను కల్పించారు.

1991 నుండి రూపొందిన-నూతన ఆర్థిక విధానం ఆర్థిక సంస్కరణలు నెహ్రూ సోషలిష్టు-మార్కెట్ ఎకనమీకి కొత్త అర్థాన్ని తెచ్చిపెట్టి ఉదార ఆర్థిక విధానమని ప్రకటించబడింది. ఇది కాల క్రమేణ వికటించడంతో 1998లో మరల నెహ్రూ సామ్యవాద తరహ సమాజ నిర్మాణానికి పునరంకితమవుతూ నూతన పోకడలతో ఉదార ఆర్థిక విధానాలను పేదలకుపకరించే రీతిని నెహ్రూ సంక్షేమ ఆర్థిక విధానాన్ని అమలుపరచ సిద్ధపడుతూ శ్రీమతి సోనియాగాంధీ కలకత్తా కాంగ్రెస్‌పార్టీ ప్లీనరీ సమావేశంలో ప్రకటించారు.

**పంచవర్ష ప్రణాళికలు :-**

ప్రథమంగ భారతదేశంలో-ప్రభుత్వరంగమును విస్తరింపజేసిన ఘనత నెహ్రూజీకే దక్కింది. సోషలిష్టు విధానాల్ని అమలుపరచు అభ్యుదయగామి నెహ్రూజీ అనిపించుకొన్నారు. సార్వజనీన సంస్థలు-రైల్వేలు జాతీయ ప్రాధాన్యత గలిగిన ప్రాథమిక పరిశ్రమల జాతీయం చేసిన జాతీయ నాయకుడు మన మాజీ భారత ప్రధాని నవభారత నిర్మాత జవహర్‌లాల్ నెహ్రూ.

1953లో ఇండియన్ ఎయిర్‌లైన్స్ -1956 లో L.I.C. ని జాతీయం చేసారు. పబ్లిక్ సెక్టర్ సోషలిష్టు సెక్టర్‌గ రూపొందినది-1953 నాటికి భారతదేశంలో సమృద్ధిగ పెట్టుబడులు శాతం వృద్ధిపొందినది. ప్రథమ పంచవర్షప్రణాళిక దేశ ఆర్థిక వ్యవస్థను తీర్చిదిద్దేదిగ రూపొందించబడింది.

మన దేశ ఆర్థిక వ్యవస్థలో - ప్రభుత్వరంగములో - అభివృద్ధి సాధించ పునాదులేర్పడ్డాయి. జాతీయ పునర్నిర్మాణం కోసం ప్రతి పంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వరంగం వాటినన్ని నిధులను పెంచుతూ వస్తుంది. 1961 లో మూడు పంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వ పెట్టుబడులు బాగా వృద్ధి చెందాయి.

ప్రభుత్వరంగంపై స్థిరపెట్టుబడి వాటా 2.3 నుండి శాతం 1950-51 - 1978-79 సం.ల మధ్యలో పెరిగింది. 1960-61లో ప్రభుత్వరంగం వాటా 25% అదే 1970 నాటికి 65% వృద్ధి అయింది. 1953-54 నుండి ప్రారంభమైన హిందూస్థాన్ నేవల్ షిప్‌యార్డ్ టెలికాం ఇండస్ట్రీ ఉక్కు పరిశ్రమలు ప్రభుత్వరంగ సంస్థలెన్నో విస్తరించాయి. జాతీయకరణ జరిగి దేశీయ ఉమ్మడి సంపదలు ఎంతగానో అభివృద్ధి నందాయి. సోషలిష్టు మార్క్సెట్ సమాజ నిర్మాణానికి బాటలేర్పడ్డాయి.

## నెహ్రూజీ భూసంస్కరణలు:-

1952 లో గ్రామీణాభ్యుదయానికి విదేశీ సుహృద్భావ సహాయపథక మొకటి ప్రారంభమైనది. ఫోర్డు ఫౌండేషన్ మన దేశంలో కమ్యూనిటి డెవలప్‌మెంట్ పథకాన్ని ప్రారంభించినది. 1954లో 480 అనేది పనికి ఆహారం పథకంఒకటి ప్రారంభించబడినది. ఈపథకం మేరకు అమెరికా తన మిగులు ధనాన్ని భారత్‌కు ఇచ్చేది ఇందువలన దేశంలో భవనాలు రోడ్లు కాలువలు ఇతర మౌళిక సదుపాయాల అభివృద్ధికి అవకాశం కలిగింది. ఈ పథకం తదుపరి రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ అమెరికావారు నూతనఅధిక దిగుబడి వంగడాలను మనదేశానికి సప్లయి చేసారు. 1960 లో మనదేశంలో హరిత విప్లవం ప్రారంభించబడింది. ఫలితమిచ్చింది.

తదుపరి దేశనేత నెహ్రూజీ దేశంలో భూసంస్కరణకు ప్రాధాన్యత నిచ్చారు. భూపరిమితులు విధించబడినవి. 1977 నాటికి 36 కోట్ల ఎకరాల సాగుభూమి ఉండేది. సుమారు నలభై లక్షల ఎకరాల మిగులు భూమి లభించింది. సుమారు 13 లక్షల ఎకరాల్ని ఆనాటికి పంచిపెట్టి భూసంస్కరణల ద్వారానేగాక సాంకేతిక విజ్ఞానం ద్వారా కూడా వ్యవసాయకోత్పత్తుల సాధనకు గట్టి కృషి జరిగింది.

హరిత విప్లవం వలన-అధిక దిగుబడి వంగడాలతో పంటలు హెచ్చింపు ఫలితాల్ని సాధించాయి. 1966-67 లో 1967-77 పది సంవత్సరాల్లో 20% ఆహారదాన్యాల ఉత్పత్తి పెరిగింది. ఆహారోత్పత్తిలో స్వయం సమృద్ధి దిశగ భారతదేశం అడుగుపెట్టింది.

ఆనాడు కాంగ్రెస్ ప్రభుత్వం రైతాంగానికి ఎరువులపై అధిక సబ్సిడీల నిచ్చిన ఘనత గాంచింది. కోట్లాది రూపాయల్ని వెచ్చించింది.

1967లో భారత దేశం ఆనాటి అగ్రరాజ్యాలలో ప్రధానముగ నిలచిన సోవియట్ రష్యాతో సంబంధాలను మెరుగుపరచుకున్నది. సోవియట్ రష్యా భారతదేశానికి ఆర్థికంగ ఆనాడు ఎంతగానో చేయూతనిచ్చింది.

**అభివృద్ధి పథంలో భారతదేశం:-**

1970 లో గుత్త పరిమిత వ్యాపార వస్తు కార్యకలాపాల చట్టం 1970 లో భారతీయ గుత్త హక్కులచట్టం 1973లో విదేశీ మారక క్రమబద్ధీకరణ చట్టం రూపొందినవి. ప్రధాన పరిశ్రమలతోపాటు బ్యాంకుల్ని కూడా జాతీయం చేసారు. 1970 నాటికి భారతదేశం పలురంగాల్లో అభివృద్ధిపొందినది. దేశంలో విద్యుత్‌తోపాటు ఉక్కు పెట్రోలియం శక్తి వనరు చమురు గనులు ఇనుము ఉత్పత్తులలో గణనీయమైన అభివృద్ధిని సాధించినది.

1981 వ సం. నుండి దేశ ఆర్థిక వ్యవస్థలో బలమైన మార్పులు చోటు చేసుకున్నవి. పెట్టుబడి టెక్నాలజీ దిగుమతి చేసుకోవడం జరిగింది. సబ్సిడీల్ని అందజేయడం ప్రజాపంపిణీ విధానం కూడ బహిరంగ మార్కెట్ విధానాల్ని అమలుపరచడం వ్యవస్థాగత సర్దుబాటులు ఇవి కొన్ని మాత్రమే.

1980 మధ్యలో రాజీవ్‌గాంధీ వచ్చి దేశాన్ని 21వ శతాబ్దంలోనికి తీసికొని పోవాలన్న నినాదం ఇచ్చారు. స్వయం సంపూర్ణ సోషలిజం గరీబీ హఠావో పాలనా లక్ష్యాలుగ నిర్ణయించబడ్డాయి.

1991 లో దేశ ఆర్థిక వ్యవస్థలో పారిశ్రామిక సరళీకరణ జరిగింది. చివరికిది వాణిజ్య సరళీకరణకు దారితీసింది. 1990లో V.P. సింగ్ ప్రధానిగ జనతా పార్టీ కేంద్రంలో ఉండగా నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీకి ప్రతిబంధకాలు ఏర్పడటం ప్రారంభమైనవి V.P.సింగ్ ప్రభుత్వం 1990లో 1.173 కోట్ల ఐ.యం.యఫ్ ఋణాన్ని తీసికొన్నది.

చంద్రశేఖర్ దేశ ప్రధానిగ(నేషనల్ ఫ్రంట్) 3.153 కోట్లు I.M.F.ఋణాల్ని అందుకున్నది. ఈతని పాలన కాలంలోనే దేశంలో 70 టన్నుల బంగారాన్ని అంతర్జాతీయ ధరలకన్న 20% తగ్గింపునకు భారత్ అంతర్జాతీయ మార్కెట్‌లో అమ్ముకోవలసిన దుస్థితి పట్టింది.

**దేశ ఆర్థిక వ్యవస్థ దశ దిశా నిర్దేశనం :-**

1991 నుండి దేశ ఆర్థిక వ్యవస్థలో భారీ మార్పులు చోటుచేసికున్నాయి. ఉపాధి అవకాశాలకు చోటులేకపోయింది. పారిశ్రామిక ఉత్పత్తులు పెరిగిన పారిశ్రామిక ఉపాధికల్పన శాతం పెరగలేదు. చిన్నతరహా పరిశ్రమలు మూలబడ్డాయి. ఖాయిలా ఇండస్ట్రీస్ ప్రత్యక్షమైనవి ఉపాధికల్పనకార్యాలయాల్లో నిరుద్యోగుల సంఖ్య విపరీతంగా

పెరిగింది. ప్రభుత్వం పరోక్షపన్నుల్ని భాగా పెంచారు. సంక్షేమ చర్యలకు కోత విధించినది. ప్రణాళిక వ్యయంలో కోత జరిగింది. పేద బీద ప్రజలు నిరాశలకు లోనయ్యారు. ఇందుకు కారణం నెహ్రూ ఇందిర ఆర్థిక విధానాల్ని రాజీవ్‌గాంధీ తదనంతరం సక్రమముగ అమలుపరచక పోవటమే.

డంకెల్ ఒప్పందంపై భారత ప్రభుత్వం సంతకం చేయక తప్పని పరిస్థితి ఏర్పడ్డాయి. విదేశీ కంపెనీలకు 51% నూతన పారిశ్రామిక విధానంలో ఈక్విటీ అనుమతించబడింది. విద్యుత్ రంగం ప్రైవేటీకరణ జరిగింది. బ్యాంకింగ్ ఫైనాన్సు అన్ని రంగాలలో విదేశీ భారీ పెట్టుబడులకు బార్లా తలుపులు తెరచారు. భీమా రంగం ప్రైవేటీకరణ దశకు చేరుకుంది. అభివృద్ధి అనగానే అప్పుల పర్వం ప్రారంభం.

కేంద్రంలో అధికారం చేపట్టిన వారు దేశ ఆర్థిక వ్యవస్థను ఎంతగ దిగజారుతున్న ఏమీ పట్టించుకోలేని హీన దీన దుర్దశలో ఉన్నారు. అఖిల భారత కాంగ్రెస్ పార్టీ అధ్యక్షులు శ్రీమతి సోనియాగాంధీ దేశానికి దశదిశా నిర్దేశనం చేయటానికి సిద్ధపడి రాజకీయ రంగంలో అడుగుపెట్టడం జరిగింది.

1998 కలకత్తా కాంగ్రెస్ప్లీనరీలో శ్రీమతి సోనియాగాంధీ సోషలిస్టు మార్కెట్ ఎకనమీ కాంగ్రెస్‌పార్టీ ఆర్థిక విధానమని స్పష్టముగ ప్రకటించడమే గాక తదుపరి మధ్యప్రదేశ్ పంచమఢిలో 1998 లో జరిగిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటి సమావేశంలో ఉదార ఆర్థిక విధానాల్ని పేద బీద ప్రజలకు అందుబాటులో ఉండేలా అనుసరిస్తూనే సామ్యవాద ఆర్థిక వ్యవస్థలో నెహ్రూ ఇందిరా ఆర్థిక విధానాలకు సమ్మతి తెలుపుతూ తీర్మానించడం జరిగింది.

**నేటి దేశ ఆర్థిక దుస్థితి :-**

ఇక నేటి ప్రభుత్వం పాలనలో సంభవిస్తున్న దేశ ఆర్థిక దుస్థితి. దేశీయ ఉత్పత్తి రేటు 5% తగ్గిపోయినది. 60% నిధుల్ని గ్రామీణాభివృద్ధికి వెచ్చించగలమన్న బీకర ప్రతిజ్ఞల్ని చేస్తూ శుష్క-ప్రియాలు శూన్య హస్తాల్ని చూపెడుతున్నది. విద్యపై ఖర్చును ప్రస్తుత 3.8 శాతం నుండి 5 శాతమునకు పెంచగలమన్న అమలు చేయలేని వాగ్దానాల్ని చేస్తున్నది.

రక్షణ వ్యయం 4000 కోట్లు పెంచినది. ద్రవ్యోల్బణాన్ని అరికట్ట లేకపోయింది సబ్సిడీలకు బాగా కోత విధించింది. దరిమిలా నిత్యావసర వస్తువుల ధరల్ని పెంచింది. మాటల్లో ప్రాధాన్యత రంగాల్లో మాత్రమే విదేశీ ఆర్థిక సంస్థల్ని అనుమతిస్తామని చెపుతూ ఆచరణలో ప్రధానరంగాల్లో అను ఉత్పాధిత వస్తూత్పత్తులకు వాటిని అనుమతిస్తూనే ఉంది. ఈ విషయాన్ని వీరి నూతన ఎగ్జిమ్ పాలసీ తెలుపుతుంది.

దేశంలో స్వదేశీ స్వావలంబన- ఆర్థిక విధానమును అమలుపరుస్తామని ప్రగల్భాలాడిన వారు దేశ ఆర్థిక వ్యవస్థను తన పార్టీ సిద్ధాంత ప్రణాళికలో తెలిపిన మేరకు ఆచరణలో విదేశీకి పిల్లి మొగ్గలు వేస్తున్నారు. స్వదేశీ పరిశ్రమలకు రక్షణలను కల్పించాలన్నది. నాలికకి వది ఏంది పైగా విదేశీ పెట్టుబడులను అన్ని రంగాల్లోను స్వాగతిస్తున్నది.

### రాజ్యాంగంలో సోషలిజం :-

తను ప్రతిపక్షంగా ఉండగ తను ఇన్నాళ్లు ఒంటి కాలుపై లేచి ఆనాటి పాలక ప్రభుత్వ పక్షం నూతన ఆర్థిక సంస్కరణల్ని అమలుపరుస్తున్నందున విమర్శిస్తూ వస్తున్న వారు నేడు కేంద్రంలో అధికారంలో ఉంటూ అదే ఆర్థిక విధానాన్ని వేగవంతం చేస్తామని విదేశీ బహుళజాతి సంస్థల పద్ద భజన చేస్తున్నది. ఫలించని ప్రైవేటీకరణ సంస్కరణల దిశపైపు పరుగులిడుతున్నది. సోషలిజం అనేది తన పార్టీకి హితము కానిదని ఒక ప్రక్క చెప్పకనే చెప్తున్నారు. పైగా మన రాజ్యాంగంలో సోషలిజం అనే పదమే ఆదిలో లేదని బుకాయిస్తున్నారు. దరిమిలా ఇందిరాజీ ఈ పని చేసారని నిత్యం నెహ్రూజీ ఫార్ములా సోషలిస్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థను ఖండించడమే వారి దైనందిన పార్టీ కార్యక్రమంగా పెట్టుకుంటున్నారు.

### అసమానతలు స్వైరవిహారం:-

పెట్టుబడిదారీ విధానం వలన ఆర్థిక మాంద్యం సంభవం చిక్కుల్లో పడ(త్రో)స్తుంది. సామ్యవాద ఆర్థికవిధానం ద్రవ్యోల్బణానికి దారితీస్తుంది. మరి ఎలా సమస్యను పరిష్కరించడం అత్యధిక ప్రజల జీవన స్థాయిని పెంచే ఆర్థికాభివృద్ధి లక్ష్యముగ ఉండాలి కదా. అసంఖ్యాక ప్రజల జీవన స్థాయిని పెంచాలి.

స్వేచ్ఛా సమానత్వం హక్కుల పేరిట పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో సామర్థ్యాలు-ప్రతిభలు-స్వైరవిహారం చేసి అవివేక బలహీనతల్ని కొల్లగొడతాయి. దోపిడీ పీడనల్ని ప్రవేశపెడతాయి. అసమానతలు ఉవ్వెత్తున లేస్తాయి. సమాజమున అశాంతిని తిరుగుబాట్లను రేకెత్తిస్తాయి. వీటిలో సమాజం నష్టపడుతుంది. సాంఘిక న్యాయం-సరిసమానతలు సాధించబడాలి.

### సంక్షేమ ఆర్థిక విధానం :-

దేశ నేత నవభారత నిర్మాత నెహ్రూజీ ఇందుకు మధ్యేమార్గం పరిష్కారమన్నారు. ఇందుకే నెహ్రూ మహలనోబిస్ ఆర్థిక ఫార్ములా రూపొందినది సంక్షేమ ఆర్థిక వ్యవస్థ సమాజానికి శ్రీరామరక్ష అని ఏనాడో గుర్తించగలిగిన మేధావి మన భారత ప్రధాని నెహ్రూజీ నవ భారత నిర్మాత. ఆతని దివ్య దృష్టి అమోఘం.

అలా అని సంక్షేమ ఆర్థిక విధానమన్న ఇంటి స్థలమని పట్టా అని డబ్బులివ్వటమే కాదు కనీస కనీసావాలి పనిపెట్టను బాగుపరచడము కాదు ప్రజల ఉత్పాదికత శక్తి యుక్తుల్ని పెంచి వృత్తి నైపుణ్యాన్ని పనిసామర్థ్యాన్ని పెంపొందించగలిగిన ఆర్థిక ప్రణాళికల్ని సిద్ధపరచాలి సంక్షేమ ఆర్థిక విధానం- ప్రజా జీవన స్థాయిని పెంచాలి.

ఇందుకు సమగ్రమైన భూసంస్కరణల్ని చేపట్టాలి. అందరికి కనీస ప్రాథమిక విద్యను నిర్బంధం చేయాలి. ఎల్లరికి ఆరోగ్యవైద్య సదుపాయాల్ని అందించగలగాలి. కుల మత భేదాల్ని అవంకినెట్టి ఎల్లరు దేశ ఆర్థిక వ్యవస్థ నిర్మాణంలో భాగస్వాములుగ నిలవాలి. ప్రజల జీవన ప్రమాణాల్ని సామర్థ్యాల్ని పెంచకుండా ప్రజలకు నిత్యం ఏదో ప్రభుత్వం ఉచితముగ ఇస్తుంటే పుచ్చుకొనే హీన దీన దౌర్భాగ్య ఆర్థిక స్థితిగతులకు వారిని లోను కాకుండ ప్రభుత్వం చూడాలి.

ప్రజలెల్లరు స్వయం సమృద్ధి సాధనాలుగ నిలవాలి అందుకు వారికి తగిన విద్యను ఆరోగ్య సదుపాయాల్ని వృత్తినైపుణ్యం పని సామర్థ్యాన్ని కలుగుజేయాలి. కొనుగోలు శక్తిని వారు కలిగి ఉండేలా చేయాలి వారినిఊరకనే మేపే ఆర్థిక విధానాల్ని రద్దుపరచాలి. పచ్చదనం- పరిశుభ్రం- అని రైతు బజార్లని- శ్రమదానం అని- అమలుపరుస్తున్న కార్యక్రమాల్లో- ఆర్థికాభివృద్ధి ఉండదు. సౌకర్యాలకల్పనల వలన సోషలిజం సిద్ధించదు. ఉత్పత్తి సాధనాల్ని గుత్త పెట్టుబడి దారుల హస్తాల్లో ఉంచుతూ ఉత్తుత్తి మాటల కార్యక్రమాల వలన అభివృద్ధి అగుపడదు.

**పంచవర్ష ప్రణాళికలు :-**

దేశ పునర్నిర్మాణానికే ఆది నుండి కాంగ్రెస్ గాంధేయ సిద్ధాంతాల్ని నమ్ముతూ వస్తుంది. స్వాతంత్ర్యం రాకమునుపే వివిధ రాష్ట్రాలలో పరిపాలన బాధ్యతల్ని స్వీకరించిన కాంగ్రెస్ రాష్ట్రప్రభుత్వాలు బ్రిటీష్ వారి సహకారంతో పరిపాలన వికేంద్రీకరణకు ప్రాధాన్యత నిచ్చారు. గ్రామస్వపరిపాలనకు శ్రీకారం చుట్టి గాంధీజీ ప్రవచించిన బేసిక్ ఎడ్యుకేషన్(మూలవిద్య) అమలుపరచ సిద్ధపడ్డాయి. సాంప్రదాయక వృత్తుల్ని పునరుద్ధరించ ప్రణాళికల్ని రూపొందించారు. దేశీయ పరిశ్రమలకు రక్షణల నిచ్చారు. ప్రజల జీవన స్థాయిని పెంచటానికి- దేశీయ వనరుల సద్వినియోగానికి-

1952 లో రూపొందిన పంచవర్ష ప్రణాళికలు నెహ్రూ సోషలిజానికి ప్రతీకలగ నిలుస్తాయి. ప్రభుత్వం ప్రైవేట్‌రంగాల్ని ద్విగుణీకృతం చేస్తాయి. ప్రణాళికా బద్ధ ఆర్థిక వ్యవస్థను రూపొందిస్తూ అందులో మార్కెట్ శక్తులకు ప్రధాన పాత్రను కలిగించడంలోనే నెహ్రూజీ సోషలిజం దేశానికి దిక్సూచిగ ఈనాటికి నిలువ గలుగుతున్నది. ఒకవైపు మార్కెట్ ఆర్థిక వ్యవస్థలో మార్పులు అవసరం అని నొక్కి వక్కాణిస్తూ మరోవైపు మార్కెట్ వ్యవస్థలో రాజ్యం అనవసర జోక్యం పనికిరాదని ప్రవచించిన రాజనీతిజ్ఞులు నెహ్రూజీ మాధ్యేమార్గం మహోదయమన్న మహనీయుడు

నెహ్రూ మరణానంతరం వామ పక్ష భావాలు సోషలిజం ధృక్పధం కొరవడింది. అయితే 1967 లో ఇందిర అధికారంలోనికి రాగానే మరల ప్రణాళిక వ్యవస్థకు ఊపువచ్చింది. ఇందిర సాంఘిక సంక్షేమ రాజ్య సాధనం నడుము కట్టారు. ఇందుకు దేశంలో గల గుత్తాది పతులు బడా పెట్టుబడుదారులు భూస్వాములుకినుకు వహించారు. ఎవరి ప్రయోజనాల్ని వారు కాపాడుకోవాలన్న తపన ఇంతలో కాంగ్రెస్ పార్టీ చీలిక ఊహించని రీతిని జరిగింది సిండికేట్ అవతరణ ఇందిరాగాంధీ పై తిరుగుబాటు చేసింది. 1969 లో కాంగ్రెస్ చీలిపోయింది. ఆనాటి కాంగ్రెస్ పార్టీ చీలిక సిద్ధాంతం పరమైనదే తప్ప ఏ ఒకరి ఆదిపత్య నిలపటానికి కాదున్నది చారిత్రక సత్యం. సోషలిష్టు తరహా సమాజనిర్మాణమే ధ్యేయమని ప్రకటించిన నాయకత్వం నిలిచింది- ఇందువలననే-

ఇందిరాజీ ప్రజలమన్ననలనంది ప్రజా రాజ్యాదికారంలో ప్రముఖ వ్యక్తిగ నిలచారు. 1978 వరకు ఇందిరా నాయకత్వంలో కాంగ్రెస్ కేంద్రంలో అధికార పీఠంలో మన గలిగింది. ఇందిర కాలంలోనే దేశ ఆర్థిక వ్యవస్థలో బలీయమైన మార్పులు చేర్పులు జరిగాయి. బ్యాంకుల్ని జాతీయం చేసారు. భూసంస్కరణల్ని తెచ్చిపెట్టారు. జమీందారీలకు భరణాలను రద్దు చేసారు. వ్యవసాయ సంస్కరణలు పచ్చ విప్లవం పథకాలు రూపొందాయి. ప్రజలు మన్నను ఎంతగానో అందగలిగినది కాంగ్రెస్పార్టీ.

### ఇందిర 20 సూత్రాల ఆర్థిక విధానం:-

దేశ ఆర్థిక వ్యవస్థ పుంజుకొనేలా చేయటానికి- సోషలిష్టు మార్కెట్ ఆర్థిక విధానం మేరకు ఇందిర ఇందుకు కొన్ని ఆర్థిక సూత్రాల్ని ప్రకటించి అమలుపరచారు.

1) ఉత్పత్తుల్ని పెంచాలి జాతీయ వస్తు పంపిణి జరగాలి ప్రజాపంపిణి వ్యవస్థ.
2) భూసంస్కరణల్ని అమలుపరచి మిగులు భూముల్ని పేదలకు పంచాలి.
3) నిరుపేదలకు నివేశన స్థలాల పట్టాల పంపిణి
4) వెట్టి చాకిరి విధానం రద్దుకావాలి.
5) సన్న చిన్నకారు రైతాంగం ఋణాల్ని రద్దు చేయాలి.
6) శ్రామికులకు కూలీలకు కనీస వేతనాల్ని అమలుపరచాలి.
7) నదీ ప్రాజెక్టుల్ని నిర్మించి బంజరు భూముల్ని సాగులోనికి తేవాలి.
8) అధిక విద్యుత్ను ఉత్పత్తి చేసి వ్యవసాయోత్పత్తులకు సహాయపడాలి.
9) చేనేత పరిశ్రమకు ఊతం నివ్వాలి.
10) ప్రతి ఒకరిని చాలినంత బట్ట అందేంధకు మిల్మేడ బట్టల్ని అభివృద్ధిపరచాలి.
11) పట్టణ భూవసతిపై ఆస్తులపై పరిమితులు విధించాలి.

12) గుప్త ధనమును వెలికి తీయాలి.
13) స్మగ్లర్ల ఆస్తుల్ని స్వాధీనం చేసికోవాలి.
14) ఎగుమతి- దిగుమతి విధానాల్ని సరళం చేయాలి.
15) పరిశ్రమలకు కార్మికులకు భాగస్వామ్యం కల్పించాలి.
16) రోడ్డు ట్రాన్సుపోర్టు జాతీయపర్మిట్ విధానం కావాలి.
17) ఆదాయం పన్ను పరిమితి పెంచాలి.
18) విద్యార్థుల వసతి గృహాలకు నిత్యావసర వస్తువుల్ని సరఫరా చేయాలి.
19) విద్యాలయాలకు ఉచిత పాఠ్యగ్రంథాల్ని అందచేయాలి.
20) నిరుద్యోగులకు- ఉపాధి శిక్షణ అవకాశాల్ని కల్పించాలి.

అంతేకాక బడుగు ప్రజల భాగ్యదాత ఇందిరా 20సూత్రాల ఆర్థిక విధానం పథ కార్యము అమలుపరచి దేశ ప్రజల సుఖసౌఖ్యాలకు ప్రధానమైన ఆర్థిక విధానాల్ని అమలుపరచారు.

శ్రీమతి ఇందిరాగాంధీ-హాయాంలోనే మన రాజ్యాంగ పీఠికలో లౌకికతత్వం ప్రజాస్వామ్యంలతో పాటు ''సోషలిజం సాధన దేశ ప్రజల లక్ష్యమని'' రాజ్యాంగంలో చేర్చడం జరిగింది.

1978 లో అధికారంలోనికి వచ్చిన జనతాపార్టీ నాలుగు రోడ్ల కూడలిగ కొన్నాళ్లు వ్యవహరించి చివరికి ఎవరికి వారు తలా ఒక దారిని ఎవరి మార్గాన వారు నిష్క్రమించారు. సోషలిజం లక్ష్యాన్ని నీరుగార్చారు. కేంద్రంలో మిశ్రమ మంత్రివర్గాలు వికటాట్టహాసం చేయడం ప్రారంభమైనది మొరార్జీదేశాయి తదుపరి చరణ్‌సింగ్ ప్రధానులుగ వచ్చి వుబ్బలో పుట్టిమఘలో మాయమైనారు.

1981లో తిరిగి ఇందిరా కాంగ్రెస్ అధికారంలోనికి వచ్చింది. ఇందిర సోషలిష్టు తరహా సమాజనిర్మాణానికి తన వంతు గట్టి కృషిసలిపారు. పబ్లిక్ ప్రైవేట్ రంగాలను ఎంతగానో విస్తరింపచేసారు. సోషలిష్టు మార్కెట్ ఎకనమీని-గట్టిపరచారు.

1984 లో ఇందిరా గాంధీ హత్యకు గురియైనందున ఆమె కుమారుడు రాజీవ్‌గాంధీ భారత ప్రధానిగ నిలచారు. రాజీవ్‌గాంధీ ఎన్నికలలో గెలిసి తన తల్లి ఇందిర తన తాత నెహ్రూజీ ఆర్థిక విధానం సోషలిజం ను అమలుపరచ సిద్ధపడినారు. పార్టీలో సంక్షోభం తలెత్తింది. కాంగ్రెస్‌పార్టీలో అగ్రనేతలు పార్టీ నుండి విడివడి కాంగ్రెస్‌కు ఎదురు తిరగారు.

1989 ల ఎన్నికలలో కాంగ్రెస్ ఓడిపోయింది. జనతాదళ్ వి.పి.సింగ్ ప్రభుత్వం ఈ మారు కేంద్రంలో అధికారం చేపట్టింది. దేశ ప్రదానులుగ వచ్చిన వారు అంతలోనే నిష్క్రమించడం జరిగింది. ఇక వారు అమలుపరచగల ఆర్థిక విధానాలేముంటాయి.

## సరళీకృత ఆర్థికవిధానం -పేదలకు ఉపయోగపడాలి:-

1991లో రాజీవ్‌గాంధీ హత్యకు గురి కాబడినందున మరల ఎన్నికలు జరిగాయి. పి.వి.నరసింహారావు దేశ ప్రధాని. ప్రపంచబ్యాంక్ అంతర్జాతీయ ద్రవ్యనిధి గాట్-గ్లోబరైజేషన్ శక్తులు దేశ ఆర్థిక వ్యవస్థలో బలమైన స్థానాన్ని పొందటానికి తగు ప్రయత్నాలు చేస్తాయి. డంకెల్ ఒప్పందంపై భారత్ తప్పని సరిగ సంతకం చేయవలసి వచ్చింది. దేశ ఆర్థిక విధానంలో సరళీకృత ఆర్థిక విధానం పేరిటనెహ్రూ సోషలిజానికి కొత్త అర్థాలు తీస్తారు. ఉదార ఆర్థిక విధానమని ఆర్థిక సంస్కరణలని పబ్లిక్‌రంగ సంస్థలను ప్రక్కకునెట్టారు. ప్రైవేట్ రంగానికి తగని ప్రాముఖ్యతల్ని సంతరింపజేయ సిద్ధపడినారు. సరళీకృత ఆర్థిక విధానం సంపన్నులకు తప్ప సాధారణ ప్రజానీకానికి ఒరగబెట్టిందేమి లేదన్న ప్రజాభిప్రాయంతలెత్తింది. కాంగ్రెస్ కేంద్రంలో పరాజయం పాలైంది. ఫ్రంట్‌ల పాలన కేంద్రంలో తలెత్తించాయి. గౌరవ దేవగౌడ్,గుజ్రాల్ ప్రధానమంత్రులు అవటం -గద్దెదిగడం అంతలోనే జరిగాయి. మరల మధ్యంతర ఎన్నికలు వచ్చాయి. పాలక పక్షముగ భారతీయ జనతాపార్టీ ప్రధాన ప్రతిపక్షంగ కాంగ్రెస్‌పార్టీ లోక్‌సభలో ప్రవేశించాయి. ఒకరిది అవకతవక స్వదేశీ పరిమిత ఆర్థిక విధానం మరొకరిది ఆది నుండి కాంగ్రెస్‌పార్టీ అనుసరిస్తున్న సోషలిస్టు మార్కెట్ ఎకనమీ నెహ్రూ సోషలిజం.

## సోషలిస్టు మార్కెట్ ఎకనమీ :-

నెహ్రూ సోషలిజం కేవలం వస్తూత్పత్తిలోనే కేంద్రీకృతంగాక వస్తు వినియోగం ప్రయోగాల ప్రయోజనాల్ని ప్రాధమికంగ తీసికొని రూపొందించబడినది.

నెహ్రూజీ గొప్ప భావుకుడు మాత్రమే కాదు ప్రజానేత విశ్వ శాంతి దూత అతని మెదడులో మెలగిన సరికొత్త ఆర్థిక విధానమే సోషలిస్టు మార్కెట్ ఎకనమీ.

''మార్కెట్'' ''సామాజిక'' భాధ్యత నిజానికి ఈ రెండింటికి ఏమి సరిపడదు. ''మార్కెట్''ను రాజ్యమేలకుండ ప్రభుత్వం చూడాలి. సామాజిక బాధ్యతలను వీడకుండా ప్రభుత్వం నడవాలి. సమన్వయంతో ఈ రెండింటిని సమైక్యపరచి సోషలిస్టు మార్కెట్ ఆర్థిక విధానమును భారతదేశంలో అమలుపరచిన ప్రప్రధమ భారత ప్రధాని నవభారత నిర్మాత మన జవహర్‌లాల్ నెహ్రూ-

నిజానికి నెహ్రూ- మిత వాద ఆర్థికవేత్తకాదు. అతివాద ఆర్థిక వేత్తకానే కాదు అసలు నెహ్రూ ఆర్థిక వేత్తగ కాక గొప్ప జాతీయ నాయకునిగ దేశ నేతగ శాస్త్రీయ విజ్ఞానిగ గొప్ప ప్రతిభాశాలిగ గొప్ప దేశ భక్తి నాయకునిగాడిస్కవరీ ఆఫ్ ఇండియా వంటి గ్రంధ రచయితగ తన ''పండిట్‌జీ'' బిరుదును సార్థకం చేసారు.

ఇటువంటి జాతిరత్నం దేశానికి అందించిన దేశదిక్సూచి నెహ్రూ సోషలిస్టు మార్కెట్ ఏకనపీని మాటలలో కాదనక లేదనక చేతలలో ఆర్థిక సంస్కరణల పేరుతో నియంత్రణ లేని స్వేచ్ఛామార్కెట్ ఆర్థిక విధానంపై పరుగులు చేయడమే తరువాయి దేశ ప్రజల నుండి అసంతృప్తి భావాగ్నిజ్వాలలు చెలరేగాయి. సోషలిస్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థ ఎన్నటికి కాంగ్రెస్‌పార్టీ-కరదీపికగనే ఉండాలి.

ఈ పరమ సత్యాన్ని గ్రహించిన జాతీయ కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షురాలు శ్రీమతి సోనియాగాంధీ మరల సోషలిజం స్థాపనకు కలకత్తా కాంగ్రెస్ ప్లీనరీలో ప్రకటన చేసారు.

అంతేకాక దరిమిలా మధ్యప్రదేశ్‌లో జరిగిన పాంచమడి కాంగ్రెస్ సదస్సులో సోషలిజమే కాంగ్రెస్‌పార్టీ ధ్యేయమని ప్రకటన చేస్తూ తీర్మానాన్ని ఆమోదించారు. కాంగ్రెస్ పార్టీ సిద్ధాంత పరంగ దివాళా తీయలేదని సోషలిజం స్థాపనే పార్టీకి లక్ష్యం అని నిర్ద్వంద్వముగ ప్రకటించారు. సోషలిజమే కాంగ్రెస్‌పార్టీ ధ్యేయమని నొక్కి-నొక్కి సభా వేదికలపై వక్కాణిస్తున్నారు.

# 3 వ ప్రకరణం
# స్వదేశీ మార్కెట్ ఎకనమీ

**ఆర్థిక జీవన విధానం :-**

ఆర్థిక ప్రాధన్యతలను కొద్దిమంది వ్యక్తుల ఆర్థికాభివృద్ధిని బట్టి నిర్ణయించరాదు. సమాజమున అట్టడుగున ఉన్న వారిని దృష్టిలో నిడుకొని ఆర్థిక విధానం ప్రశస్తమైనదా కాదా అని నిర్ణయింపబడుతుంది. ఆర్థిక జీవన విధానం అనేది సమాజమునగల ''వ్యక్తుల వస్తూత్పత్తి వస్తుమార్పిడి వస్తువినిమయం'' తప్ప వేరేమి కాదు.

వస్తూత్పత్తికి జాతీయతను అంటగట్టడం. వస్తుమార్పిడికి స్వావలంభనను నిర్దేశించడం . వస్తు వినిమయానికి స్వదేశీ పరిమితుల్ని విధించడం. వ్యక్తుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని ఆర్థికాభివృద్ధిని కట్టడి చేయడమే అవుతుంది. తప్పించి నిజమైన దేశ ఆర్థిక సుస్థిరతకు అంకురార్పణగ ఇది నిలవదు.

సాంప్రదాయ పరముగ అనాదిగవస్తున్న ఎదుగుబొదుగులేని చేతి వృత్తుల్ని గృహవృత్తుల్ని లఘుపరిశ్రమల్ని స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం వలన ఒక్క అడుగు కూడ ముందుకు వేయలేదు. కారణం ఆర్థిక శక్తులు ఉత్పత్తి శక్తులు యాజమాన్య శక్తులనేవి ''పరివర్తన'' దిశవైపు పరవళ్లు త్రొక్కుతాయి. తప్ప ఒక చోట పడి ఉండటానికి సుతారమూ అంగీకరించవు. ఆర్థిక సూత్రాలు మన భావన మేరకు రూపొందవు వాటి గమన నిర్దేశికతల వైపు మనం పయనించాలి.

సంపద అనేది నేడు సామూహిక జన సృష్టి తప్ప ఏ ఒక వ్యక్తి వలన గూడు కట్టుకొనేది కాదు ఇటువంటి సంపదను ఎవరి ప్రతిభా సామర్థ్యాల మేరకు వారు పొందవచ్చుననటం దీనిని అందుకోలేని అవివేక బలహీనతలను అలానే ఉండమనటం ఇది సాంఘిక న్యాయం అనిపించుకోదు. ఆటవిక దురన్యాయమవుతుంది. మానవతావాద మనిపించుకోదు. అనాగరిక చర్య అనిపించుకుంటుంది.

**సంక్షేమ ఆర్థిక విధానం:-**

బ్రతక కలిగినవాడే బ్రతకాలి- లేనివాడు చావాలి. అనడం మానవత్వానికి ఎదురీత తప్ప ఎవరు అంగీకరించని విషాద వాదమిది. సరిసమాన ప్రతిభాసామర్థ్యాల్ని సమాజమునగల వ్యక్తులు సంతరించుకోలేకపోయినప్పటికి సరిసమాన అవకాశాల్ని

వారికి కలుగుజేయటమే సంక్షేమ ఆర్థిక విధానం నెహ్రూ సోషలిజంలో ప్రధాన భూమిక సంక్షేమ ఆర్థిక విధానమే విద్యాపరంగ-సాంఘికంగ వెనుకబడిన జనావళికి వెలుగుబాటను తెచ్చిపెట్టగల అవకాశాల్ని ప్రభుత్వం వారికి కలుగుజేయాలి.

విద్యాపరంగ సాంఘికంగ ఔన్నత్యంగాంచిన వారిలో ఎన్నోవిధాల వీరికన్న వెనుకబడిన వర్గాలను దళితులను సరిసమానం చేసి మాట్లాడం సరికాదు. ఎవరి శారీరక మేధాశక్తి మేరకు వారు జీవించాలని పాట పాడటం ఉద్యమ ప్రగతికి సమాజానికి వెలుగు నివ్వగలఉమ్మడి శక్తిని ఉయ్యాలలోనిడి బుజ్జగిస్తూ నిద్రపుచ్చ ప్రయత్నించడమే అవుతుంది. ఎవరికి వారు ఉద్ధరింపబడాలనటం సరియైనదే సామర్థ్యం సంతరించుకున్నచో అయిన పలువురి కోసం పలువురు పాటుపడి తీరాలన్నది మానవ సమాజానికి సుభాంతం.

### ప్రగతి బహుముఖం తప్ప- ఏకత్వం కలిగినది కాదు:-

సమాజంలో వ్యక్తి ఉనికి మనుగడ వికసనలు తన జీవన పరిణామ దశలుగ నిలుస్తాయి. ఇందుకు దేశము బహుముఖంగ ఉండాలి తప్పించి ఏక దేశనినాదం అక్కరకు రాదు. వ్యక్తిగత అభిప్రాయం ప్రజాభిప్రాయం ఒకే రీతిగా ఉండాలన్నది నీతి బోధకమే తప్ప నిజనిర్ధారణకు నిలవదు. ప్రజలన్న విభిన్న ఆచార సాంప్రదాయాల కూడలి తప్ప ఏకోన్ముఖంగ ఎందులోను నిలవగలదేమి కాదు సమాధానం పడినపుడే సమైక్యత దరికిపోగలం.

### మనసు-బుద్ధి-అహంకృతి :-

మనసు-బుద్ధి-అహంకృతి త్రయీవిధాత్మకం -మానవుడు బహుముఖ న్యాయ సంపుటీకరణలో భాగస్వామి బహువిధ న్యాయపేటికలో తలతల మెరెసే తాత్త్వికుడు ఏకస్వామ్య నిరంకుశత్వానికి నిత్యం ఎదురు తిరిగి పోరడటానికి అన్నింటా సిద్ధహస్తుడు ఒక్క మానవీయ కోణం తప్ప ఏ శక్తి తనను బంధించలేదు. మానవ విలువలనేవి ఇందువలననే రూపొందాయి.

అయితే ఆర్థిక శక్తులు మనమభిలషించిన స్థాయిలో పనిచేయవు. సామాజికాభివృద్ధికి భిన్నమైన ఆర్థికాభివృద్ధికి తావే లేదు. ఇందువలననే సమాజమున రేకెత్తిన అసమానతలకు అసంగతాలకు నిత్యమంగళం పాడుతుంది. సమాజం.

### మానవాళిని చిత్రకపట్టి నిలపలేం :-

వ్యక్తులు స్వీయ ప్రవృత్తుల ప్రేరణ వలన సహజాతాల వలన తన చుట్టూ ఉన్న పరిసర ప్రభావాల వలన నడక సాగిస్తారు. తప్ప బోధనలు ప్రభోధాల మేరకు కాదు.

ఎవరు ఎలా వ్యవహరించాలో నిర్ణయిస్తూ ఏ ఒకరిని తీర్చిదిద్ది చిత్రకపట్టి అందరిని ఒక మూసలో వేసి మనం నిలపలేం నిత్య పరిణామ దశల్ని కలిగినది సమాజం. ఎదుగు బొదుగులేని సమాజనిర్మాణానికి గాక నిత్యమార్పు చేర్పులకు నిలయమై నిలవగలది. తనలో తాను తనకు తానే పరిణామ దిశవైపు పరుగిడుతుంది సమాజం.

## దేశానికి దిక్సూచి -సరియైన ఆర్థిక విధానవేం:-

నెహ్రూసోషలిజం- ఒక వైపు వ్యక్తుల అంతరంగిక విషయాల్లో తలదూర్చదు. మరొకవైపు సమాజానికి దశ దిశా నిర్దేశనం చేయటం తన భాధ్యతగ నిలుపుకుంటుంది. స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం వ్యక్తి సాంప్రదాయక ఆర్థిక విధానంలో ఒక పనిముట్టుగ నిలుపుతుంది. తప్పించి నిత్య పరిణామ శీలిగ తను మారటానికి తగిన ప్రాతిపధికలను అందించదు. ఉన్నచోటనే ఊడిగం చేసుకుంటేనే మంచిదని చెపుతుంది. ఉజ్వలమైన ఆర్థిక భవిష్యత్కు అంకురార్పణ మిడగల ఆధునిక శాస్త్రీయ సాంకేతిక విజ్ఞాన ప్రగతిని అందించగల తీరు తెన్నులను నిలబెట్ట లేనిది. స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం.

## వ్యక్తిగత స్వయం సమృద్ధి-అభివృద్ధి :-

ఆశీర్వచనాల వలన వ్యక్తులకు సమాజానికి ఆత్మబలం సత్ సంకల్ప బలం ప్రజ్వరిల్లిన నిజమైన ఆర్థికాభివృద్ధి ఆర్థిక శక్తులవలననే జరుగుతుంది. ఆర్థిక క్రియా కార్యకలాపాల పనిముట్టు నిజానికి మానవుడు ఇందువలననే దేశానికి దిక్సూచిగ నిలవ గలది ఆర్థిక విధానమే తప్ప మరొకటిగ ఉండదు. ఆర్థిక ఔన్నత్యం అందని దేశమైన వ్యక్తి అయిన అడుగంటడమే తప్పించి అభ్యుదయం అభివృద్ధివైపు అడుగిడటం జరగేపనికాదు.

తాత్త్విక పరమైన అభివృద్ధికి అభ్యుదయానికి తను ఏ ఒకరి సహాయమక్షించక పోయిన తను పొందనవసరం లేకపోయిన ఆర్థిక పరమైన అభివృద్ధి( జీవన స్థితిగతులు) నియంత్రణలను ఇతరుల సహకార సద్భావాల్ని అందనిదే తను పొందలేడు. వ్యక్తులలో వారికి వారు పరస్పరమైన శక్తి యుక్తుల్ని పరస్పర ప్రయోజనాల సిద్ధికొరకు వెచ్చించిన సమాజంలో అభ్యుదయమైన అభివృద్ధియైన సాధ్యం అవుతుంది.

అందుకు సామాజిక ప్రగతి అనేది వ్యక్తుల విశ్వాస నమ్మికలపైగాక వ్యక్తుల ఆర్థిక కార్యకలాపాల శక్తి వలన యుక్తిలో లభిస్తుంది. స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం ఈ శక్తికి ఒక గీత గీసి నిలబెడుతుంది. ఫలితంగానుగెద్దు జీవితంలో గడపటం తప్ప గడించగల అభివృద్ధి అంటూ ఏమీ ఉండదు.

**9) నన్ను ముట్టకు దూరంగా పో అని బ్రతకటానికి లేదు :-**

ఆధునిక ప్రపంచీకరణలో పాల్గొని (Globalisation) తగిన బలదర్పాలను పుంజుకొని -గట్టి పోటీని ఎదుర్కో-గలిగితేనే తప్ప ఏ దేశానికి నేడు బ్రతికి బట్టగట్టే యోగం ఉండదు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో మనదేశ ఆర్థిక వ్యవస్థ భాగస్వామిగ నిలవక తప్పదు- ప్రపంచ బ్యాంకు ఋణాల వాణిజ్య సంస్థనుండి(W.T.O)వనం తప్పించుకోలేము.

స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానమని మనం దూరముగ ఉండటానికి హిందూ దేశ ఆర్థిక దిజ్మండలం మనకు అవకాశమివ్వదు. అడుగు అడుగున అవాంతరాలు ఎదురౌతాయి. ప్రపంచ ఆర్థిక శక్తి నుండి బయటపడి దేశీయోత్పత్తులు అమ్మకం కొనుగోళ్ల మేరకు ఏర్పడు వినిమయ జీవనపద్ధతుల్ని మనం కొనసాగించలేం. సరికదా జరుపుకొనలేం. ప్రపంచ ఆర్థిక వ్యవస్థనుండి మనం వేరుపడి నిలువలేం. కంప్యూటర్ యుగంలో కాలం కుదించుకపోయింది- దూరం హరించుకపోయింది.

**ఆకాశంలో సగం ''మహిళలు'' :-**

వృత్తినైపుణ్యం-పనిసామర్థ్యం- ఆర్థిక ఔన్నత్యం అనేవి నిరక్షరాస్యతకు నిలయమైన దేశంలో వైద్య ఆరోగ్య సదుపాయాలు కొరవడిన భారత్‌లో రాణించవు. ఆకాశంలో సగం మహిళలు అనడమే తప్పా ప్రాధాన్యతల్ని వారికి అందజేయ నిరాకరిస్తున్న ఇండియాలో ఎలా అభివృద్ధి పుంజుకుంటుంది. స్వదేశీపరిమిత ఆర్థిక విధానం జీవశ్చవంలా బ్రతకటానికి ఉపకరిస్తుందే తప్ప బాగా బ్రతికి అభ్యుదయ పథంలో తగిన జీవన ప్రమాణాలలో జీవితం సార్థకం చేసికొనటానికి ఏ మాత్రం ఉపకరించదు గాక ఉపకరించదు.

## 4వ ప్రకరణం
## సాంప్రదాయక ఉత్పత్తి పద్ధతులు

### పాత ఉత్పత్తి పద్ధతులకు -పదునుపెట్టిన- ప్రయోజనం లేదు:-

ఆధునిక టెక్నాలజీ-సమాచర వ్యవస్థ వలన ఉత్పత్తి విధానాలు పూర్తిగ మారిపోయే ఆర్థిక స్థితిగతులు ఆసన్నమౌతున్నాయి. పునాదులు చెడిపడిపోతున్న గోడల్ని పట్టుకొని వ్రేలాడిన ఫలితం ఉండదు. మరల కట్టడాల్ని పునర్వికసింప జేసికోవాలి. తప్పదు మరి-

అవ్యవస్థీకృత రంగంలో నిలచిన-సాంప్రదాయక వృత్తుల్ని మరల మనం నిలబెట్టాలనడం సరికాదు వాటిని పునర్వికసింపజేసికోవాలి. తప్ప యధా తధమున వాటిని కొనసాగిస్తామనడం ఎండిపోతున్న పచ్చగడ్డిని మరల ప్రాణ ప్రతిష్టచేయగలగడమే అవుతుంది. ఉత్పత్తి విధానాలు మారుతున్న తరుణంలో పాత ఉత్పత్తి పద్ధతులకు మరల పదును పెట్టడానికి ఎన్ని ఆదరణ పద్ధతుల్ని నెలకొల్పిన ప్రయోజనం శూన్యం.

### ఉత్పత్తులకు సరియైన మార్కెట్ లభించాలి:-

సాంప్రదాయక వృత్తుల వారని-వారికి తగిన పనిముట్లును ఆదరణతో ప్రభుత్వం అందించిన ఆ వృత్తుల వారు వారి ఉత్పత్తులకు సరియైన మార్కెట్ లభించనిదే వారెలా వారి ఉత్పత్తుల్ని వృత్తుల్ని కొనసాగించుకోగలరు. చివరికి ఇచ్చిన పనిముట్లును తాకెట్టు పెట్టుకొని లేదా అమ్ముకొని కొంత కాలమైన జీవించవచ్చునన్న హీనదీన ఆర్థిక పరిస్థితికి వారు దిగ జారిన మనం ఆశ్చర్యపడనవసరం లేదు. తన పెట్టుబడిని సంపాదించుకొనని తన శ్రమ విలువ తననెలా రక్షిస్తుంది సరియైన ఉత్పత్తి పరికరాలు( సరుకులు) కొరవడినందుననే వారి వృత్తులు సన్నగిల్లుతున్నాయి అనడం ఆకతాయి తనం తప్ప ఆర్థిక పరమైన విషయం కాదు.

### పనిముట్లు పంపిణి - ప్రచారపథకం:-

కమ్మరి కుమ్మరిష్కడంగి,కంసాలి, దేవాంగ,ఎరకల యానాది, గౌడ సాంప్రదాయక వృత్తులవారు గ్రామీణ ప్రాంతాల్లోనేడు నిర్వీర్యమై నిలచారు. వీరు తయారు చేయగల వస్తూత్పత్తులకు దీటుగఎంతోనీటుగ భారీస్థాయిలో ఆధునిక యంత్రాలు పారిశ్రామిక రంగం విజృంభిస్తున్నది. శరీర కష్టంతో నిర్మించే వస్తూత్పత్తికి బదులు యంత్ర సహాయంతో నిర్మిస్తున్న వస్తుసముదాయం లభిస్తుంది. భారీస్థాయిలో ఉత్పత్తులు జరిగినందునభారీస్థాయిమార్కెట్లో తక్కువ ధరలకు వస్తు సముదాయం లభిస్తున్నది.

సాంప్రదాయ వృత్తులు వారు చేతులు ముడుచుకొని కూర్చోవలసి వస్తుంది. వీరి ఉత్పత్తులకు గిరాకీ ఉండదు. కావున సప్లయి సమస్య తలెత్తదు. ప్రభుత్వ బడాయి తప్ప మూలబడిన వృత్తుల వారికి మూల్యమును సంపాదించలేని పనిముట్ల పంపకం వట్టి గారిడి ప్రభుత్వధనం నిరుపయోగానికిదొక మార్గం ప్రచారానికి ఒక పధకం.

మెట్టప్రాంతం-మైదానం ప్రాంతం :-

సమతూకపు భౌగోళిక వనరుల్ని ఏదేశంలో గల ప్రాంతాలు కలిగి ఉండవు. మైదాన ప్రాంతాలని మెట్ట ప్రాంతాలని విభజననందక తప్పదు. సరిసమాన ఆర్ధిక స్థితి గతులు ఇందువలన సర్వులకివి కలిగించలేవు. మైదానం ప్రాంతం ప్రజల జీవన స్థాయి మెట్ట ప్రాంతం ప్రజల జీవన స్థాయినిమించి ఉంటుంది.

స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్ధిక విధానమని ఏ ప్రాంతం ప్రజల ఆర్ధిక స్థితిగతుల మేరకు ఆ ప్రాంతం ప్రజల బ్రతకమనడం అప్రజాస్వామ్యం పరిమిత స్థాయిని అధిగమించి ప్రభుత్వం సంక్షేమ ఆర్ధిక విధానాల్ని చేపట్టాలి. అత్యాధునిక శాస్త్రీయ సాంకేతిక ప్రగతిని ద్వివిధ ప్రాంతాలలో ప్రజల జీవన స్థాయి సరిసమానముగ ఉండేలా చూడాలి. ఇదే సాంఘిక న్యాయం స్వదేశీ విదేశీ ఆర్ధిక సంస్థల్ని ఇందుకు వినియోగించుకోవాలి. ప్రభుత్వ ప్రైవేట్ రంగాల్ని ఇందుకు సమాయత్తం పరచాలి. కేవలం నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఆర్ధిక వ్యవస్థలోనే ప్రాంతీయ అసమానతలనేవి పూర్తిగ తొలగించబడతాయి.

స్వదేశీయ సంస్కృతి - విదేశీయ సంస్కృతి :-

మానవుని నిత్య దైనందిన వ్యవహారాల నుండి ఇచ్చి పుచ్చుకొనే సుహృద్భావ వాతావరణంలో సామాన్య జనజీవనం నుండి సంస్కృతి అనేది పుడుతుంది. ఆచార సాంప్రదాయాల పద్ధతులు జీవన విధానాలు ఒక జాతి సంస్కృతిని తెలియపరుస్తాయి. ఇటువంటి సంస్కృతి స్థాయిని సౌభాగ్యాన్ని సుస్థిరతను పెంచు ఏరకమైన ఆర్ధిక వస్తువునైన (Economic good) మనం స్వీకరించాలి. ఆసరకు స్వదేశీయమైన విదేశీయమైన మనకు గ్రాహ్యమే కావాలి. సుస్థిరజీవనానికి అందుకొనక తప్పదు.

దేశీయ సంస్కృతికి-విరుద్ధమైనదని-మనకు మనం నిర్ణయించుకొని ఆసరుకును వినిమయం చేసికొనకుండా ఉండటం మనం మరల ఆటవిక జీవిన విధానం వైపు మరలడమే అవుతంది. ఇందువలన ఆర్ధిక దుస్థితి నివారించబడదు. స్వదేశీపరిమిత మార్కెట్ ఆర్ధిక విధానం ఎంతటి ఉపయోగకరమైన జీవన అవసరమైన

మనకు అందకుండా జేస్తుంది. విదేశీయ సంస్కృతికి చెందిన సరకు అని మనం తిరస్కరించిన మానవాళి తన సుహృద్భావాన్ని కోల్పోకతప్పదు. ఇదే సంస్కృతిని వారనుసరించిన మనం కళ్లప్పగిస్తూ చూస్తూ- ఊరుకోవాలి.

**స్వదేశీ -విదేశీ వస్తుజాలం:-**

ఇందుకు నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థలో స్వదేశీ- విదేశీ వస్తుజాలం దేశ పౌరులకు విచ్చలవిడిగ మార్కెట్‌లో లభిస్తాయి. ఎటువంటి విధి నిషేధాలుండవు. ఏ వస్తువు వినిమయం చేసుకోవాలన్న అది ఆజాతి సంస్కృతి సంస్కారముపై ఆదారపడి ఉంటుంది. వ్యక్తి అయిన దేశమైన నేడు మార్కెట్ సంస్కృతిని అంగీకరించాలి. ఇందుకు లోబడి వ్యవహరించాలి. జాతీయ సంస్కృతి అని జాతిని నిర్వీర్య పరచే విధి విధానలెంత మాత్రం మన సౌభాగ్యానికి ఉపకరించవు.

**ప్రభుత్వానికి గుత్తాధికారం :-**

సర్వాధికారం కొరవడిన ''రాజకీయాధికారం''- ఉండదు. ప్రభుత్వ జోక్యం చేసికొనిన ప్రజాజీవితం-లేదు ప్రభుత్వానికి గుత్తాధికారం లేని ఆర్థిక వ్యవహారాలు అంటూ ఉండవు. అన్ని విషయాలపై సర్వస్వతంత్ర్యత సిద్ధాంత రీత్యా సరిపడదు. ప్రభుత్వం అదుపు అజ్మాంయిషీల నుండి వేరుపడి సుఖమయు జీవనం గడపగలమనుకోవటం భ్రమ తప్ప నిజదైనందిన జీవితమున కుదరదు. అయితే ప్రభుత్వం వ్యక్తిగత విషయాలలో తలదూర్చరాదు. వ్యక్తుల ఇతర విషయాలలో ప్రభుత్వం జోక్యం చేసికొనక తప్పదు ఆర్థిక వ్యవహారాల్ని చక్కబెట్టక తప్పదు. సమాజాన్ని చక్కదిద్దే బాద్యత ప్రభుత్వానిదే.

**జీవన విధానం :**

''తప్పు'' దారిలో అలోచించడం మానేసి-లక్ష్యాలు సవ్యమైన దిశగ ఉండే చర్యలు తీసికోవాలి. దేనికైన మానవాభ్యుదయమే గీటురాయి అమ్మకం కొనుగోలు పద్ధతి మానవ జీవన సరళిని నిర్దేశిస్తుంది. వినిమయ జీవన సరళిని తీర్చిదిద్దుతుంది. ఈ అమ్మకం కొనుగోలు పద్ధతి నుండి మానవుడు వేరుపడి జీవించగలగాలన్నది ఒక ఆశయం ఒక ఆదర్శం తప్పనిజ జీవింతంలో ఎదురు పడనిది-వినిమయం అనేది జీవన సరళిలో ఒక భాగం. ఉత్పత్తి శక్తుల కారకాల నుండి వేరుపడవు పరచలేము. దేశీయ పరిమిత మార్కెట్ శక్తులు మనం చెప్పినట్లు మన చేతుల్లో ఉండవు ప్రకృతి శక్తులు మనం ఆధినంలో ఉండవు. మన అభిలాష కోరికల పర్యవసాన రూపమే మన జాతీయవిధానం.

స్వయం సంపూర్ణ భాగస్వామి:-

ప్రతి ఒకరికి చేతికి పని-ప్రతి ఒకరు ప్రతి ఒక విషయంలో స్వయం సంపూర్ణ భాగస్వామి ఇదే స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానానికి ప్రతీకగ నిలుస్తుంది. ఇదేలా సాధ్యం ప్రతి ఒకరి చేతిలో అందుకు తగిన వృత్తి నైపుణ్యం పని సామర్ధ్యం పెట్టుబడుల శక్తి ఉంటేనే తప్ప ప్రతి ఒకరి చేతికి పని అనేది దొరుకుతుందా! ఆదేశించిన అప్పగించిన పనులు విషయమున భాగస్వామ్యం అనేది ప్రతిపాదిస్తున్న సదరు విషయములో సదరు వ్యక్తి పాలుపంచు కొనగలిగినపుడే సాధ్యం. ఈ పనులకు మీ అందరు భాగస్వాములే అంటే అది రాజకీయాంశమే తప్ప ఆర్థికాంశముగ నిలవదు. ఇందుకు ప్రతి ఒకనికి విద్యాగంధం అబ్బాలిచదువురి కావాలి. నైపుణ్యం పెరగాలి తగిన ఆర్థిక స్థితిగతుల్ని నిలుపు కోవాలి తగిన ఆరోగ్య వైద్య సదుపాయాల్ని అందగలగాలి సామాజిక జీవనస్థాయి పెరగాలి-లేనిచో-ప్రజల భాగస్వామ్యం- ఎలా సిద్ధిస్తుంది.

**10) పబ్లిక్‌సెక్టర్-పరమావధి ప్రజాశ్రేయస్సు :-**

వీటిని సాధించగలది-నెహ్రూ-సోషలిష్టు మార్కెట్ ఆర్థిక విధానమే తప్ప స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానము వలన కాదు. పబ్లిక్‌సెక్టర్-పరమావధి ప్రజాశ్రేయస్సు ప్రైవేట్‌సెక్టర్ పరమావధి వ్యక్తుల ప్రయోజనం సంక్షేమఆర్థికవిదానాల్ని చెప్పి నిర్వహించగల ఆర్థిక శక్తి యుక్తుల్ని కేవలం నెహ్రూసోషలిజంతోనే సంతరించుకోగలదు స్వదేశీ పరిమిత ఆర్థిక విదానం సమాజం సౌభాగ్యానికి అవసరమైన రీతిలో ఉపయోగపడగల పెట్టుబడి శక్తిని సంతరించుకోలేదు. పరిమిత ఆర్థిక అవకాశాల్నిగల స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విదానం ప్రజారంగకంగ నిలువలేదు. వినిమయ మార్కెట్ జీవన విధానం నుండి మానావాళి బయట పడలేదు. కారణం. ఈ జీవన మార్కెట్ సరళిని తీర్చిదిద్దుకొని పోషిస్తున్నదీ మానవాళియే కదా.

## 5వ ప్రకరణం
## పనిచేయుని-ఫలితమివ్వని ఆర్థిక విధానం

**విధానాల రూపకల్పన కర్తలు - పోటీ స్పర్ధలు:-**

పోటీ స్పర్ధలు లేని మార్కెట్ విధానం-స్నేహపూరిత ఆర్థిక విదానం ఇది మన భావన మేరకు రూపొందగలది. తప్ప నిజమైనందిన జీవితమున సంభవించునది కాదు. కారణం వస్తూత్పత్తికి నిజమైన కారకం పోటీ స్పర్ధలే స్పర్ధవినా ఏదీ వర్ధిల్లదు. చివరికి విజ్ఞానార్జన కూడ వ్యక్తులలో ఈ పోటీతత్త్వం స్పర్ధ జనించనిదే పట్టువడదు. పరీక్షలు విధానాల రూపకల్పన కర్తలు పోటీ స్పర్ధలే కద. సుహద్భావ వినిమయ జీవిన విదానం ఆశయం ఆదర్శాల్ని కలిగిన వ్యవస్థ తప్ప ఆచరణలో సిద్ధించనది ఆచరణ సాధ్యం కానిది. మర్కెట్ ఎకనమీకి మించిన మానవ జీవితం కొనసాగదు కొనసాగితేనే కద. మనుగడ సాధ్యం మనుగడ వినావికసన అనేది వ్యక్తికి కలుగదు.

**ఆదేశాలవలన ''పని విభజన'' పనిచేయదు :-**

మార్కెట్ ఎకనమీ అన్న తదుపరి డిమాండ్( గిరాకీ) సప్లయిలు ఆధి దేవతలుగ నిలుస్తాయి. ఆత్మీయత అనుబంధం జాతీయత ఆవిరిగ మారుతాయి. ఆర్థిక శక్తి ఉత్పాదన శక్తి వినిమయ శక్తి కొనుగోలు శక్తి దయా ధాక్షిణ్యాల పరిధిలో నడువవు. ప్రేరణ ప్రోద్బలాలతో పాటు సహజాతుల ప్రభావాలు సహజవనరుల స్థితిగతులు ఇందుకు బలీయమైన కారణాలుగ నిలుస్తాయి. లాభనష్టాల పరిధి మేరకు వస్తూత్పత్తి సేవల సృష్టి తప్ప ఆదేశాలవలన పని విభజన జరిగిన అది మంచి ఆర్థిక ఫలితాల నివ్వదు. స్నేహపూర్వకంగ వస్తూత్పత్తి సేవలు జేసి తరించండి అన్న దినాలు గతించాయి. పూర్తిగ ఆర్థిక శక్తుల విజృంభణ మేరకు వస్తూత్పత్తి సేవలో సృష్టి జరిగే ఆదునిక కాలమిది.

**మార్కెట్ ఎకనమీ ఆశీర్వచనాల వలన వడవదు :-**

మార్కెట్ ఎకనమీకి సరిహద్దుల్ని నిర్ణయించలేం. మానవాళి వలనిది రూపొందినది. తప్ప మానవుని వలన ఏర్పడినది కాదు సమాజానికి సరిహద్దుల్ని నిర్ణయించలేం మానవ సమాజాన్ని వినిమయం మేరకు విభజించి చూడలేం. ఉత్పత్తి శక్తలు యాజమాన్య శక్తులే ప్రాంతాన ఏ దేశాన ఒకే రీతి నీతిలో ప్రస్ఫుట పడుతుంటాయి వీటికి సరిహద్దుల్ని నిర్ణయించడం మానవునిలో గల అంతర్గత సహజ శక్తుల్ని మనం ఆపగలమనుకోవడమే.

**పరిమిత పెట్టుబడుల ఉత్పత్తులు సరిపోవు:-**

నిరంకుశ విధానాలలో వర్తకం-వాణిజ్యం సాధ్యంకావు. ప్రజాస్వామ్య యుగంలో స్వేచ్ఛావాణిజ్యానికి వర్తకానికి రాచబాటలు ఏర్పడ్డాయి. ప్రపంచ దేశాలన్ని నేడు స్వేచ్ఛా వాణిజ్యం వైపు పరుగులు తీస్తున్నాయి. స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానాల్ని ఆర్థిక విధానాల్ని మనం ఎంత గట్టిగ పట్టుకొని వ్రేలాడిన పరిమిత పెట్టుబడుల ఉత్పత్తుల ప్రజల జీవన స్థాయిని పెంచలేవు. కనుక అది నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఆర్థిక విధానం వైపుమనల్ని తీసికొనివెళ్లుతుంది తప్పదు మరి కాలగతిలో నిలచిన ఆర్థికవిదానం సోషలిజం.

**స్థానిక శ్రామిక పెట్టుబడి ఉత్పత్తులు :-**

స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానము ప్రాతిపధికగా నిలువగల స్థానిక శ్రామిక పెట్టుబడి ఉత్పత్తులు దేశీయ అంతర్జాతీయ మార్కెట్ ఆర్థిక వ్యవస్థలు సరితూగలేవు. పోటీని తట్టుకొని నిలవలేవుఉత్పత్తి సరఫరా రెండింటిలోనిది వెనుకడుగు వేయక తప్పదు. స్థానిక ప్రదేశాల తగిన పంపకం వినియోగాలకు ఈ వస్తూత్పత్తిసేవలు నోచుకోలేవు.

తనే ఉత్పత్తి శక్తి తనే యాజమాన్య శక్తి చేస్తున్న పనిలో తాను సంతృప్తి పడగలడమే తప్పించి చేసిన పనికి తగిన విలువల్ని అందలేడు. శ్రామిక పెట్టుబడి ఉత్పత్తులు కలిగి విశేష ఆదరణ మార్కెట్లో లభించవు. విరివిగ ఇవి లభిస్తాయి. అనటానికి ఆస్కారం లేదు సన్న చిన్న కారు రైతాంగం తనే ఉత్పత్తి శక్తి తనే యాజమాన్య శక్తి తన బ్రతుకు తన వస్తూత్పత్తి సేవల పంపకాల్లో పరిమితమై ఉంటుంది. తప్పించి బాగా విస్తరించి అభివృద్ధికి అవకాశమే లేదు.

**సేవల పరిధి విస్తరణ చాలా సంకుచితం :-**

తన స్థాయిలో జరిగిన ఉత్పత్తికి తగిన ప్రేరణ ఉండదు. తగిన మార్కెట్ ఉండదు. తన మేరకు తన ఉత్పత్తి పంపకం అన్న తను బాగుపడిందేమి ఉండదు. బ్రతుకు కొనసాగడం తప్ప కట్టెలుకొట్టి జీవించే వారు కుండలు చేసే కుమ్మరి వస్తూత్పత్తిలో ఏమి వృద్ధిపొందలేదు. ఇక సేవలొనరించే కుమ్మరి వడ్రంగి తన ఉన్నచోట నుండి బయటపడు ఆర్థిక స్థితి గతుల్ని అందలేడు తవ సేవల పరిధి విస్తరణ చాలా సంకుచితం.

ఇటువంటి ఉత్పత్తులు-సేవలపై నిలచిన స్వదేశీ పరిమిత ఆర్థిక విదానం బ్రతికి బాగుపడి కట్టడం బ్రాంతికరం. ఇది ఎన్నటికి శాస్త్రీయ ఆర్థిక విధానముగ

నిలద్రొక్కుకోలేదు. మనం నిలబెట్టిన ఆర్థిక వ్యవస్థ కాలానికి ఎంతోకాలం నిలబడదు. కొన్ని వృత్తులు రాణింపబడటానికి మరికొన్ని వృత్తులలో మూలపడటానికి ప్రజల అభిరుచులు అభిలాషలు మారడంతో పాటు వీటిలో గల నాణ్యత ఉపయోగిత సౌలభ్యాలు సన్నగిల్లడమే తప్పించి ఏ ఒకరి ప్రేరణ ప్రోద్బలాలుకావు వస్తూత్పత్తులు సేవలు విస్తరించినపుడు విరివిగ తగిన ఆర్థిక విలువల్ని అందగలవు.

## ఆర్థిక వ్యవస్థకు మూలస్తంభాలు :-

స్వేచ్ఛావిపణి ప్రైవేటీకరణ భౌగోళికరణ ఏక ధ్రువ ప్రపంచం విస్తరిస్తున్న ఆధునిక యుగములో స్వదేశీ ఫిలాసఫీ అంతగ పనిచేయదు. వర్తకవాణిజ్యాలు విదేశీయతల్ని సంతరించుకొనక తప్పదు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ నుండి వేరుపడి నడవటం ఈనాటి ఆధునిక మానవునికి అవకాశంలేదు. మడిగట్టుకొని కూర్చున్నవారు చివరికి మట్టిపాలుకావడమే తప్ప మరోలా అభివృద్ధి పథంలోనికి రాలేదు.

ఆర్థిక వ్యవస్థ రూపుదాల్చటానికి మానవ సమాజమునందలి అభిరుచుల అభిలాషలతోపాటు ఆదేశ జనాభా విస్తీర్ణం అక్షరాస్యత వైద్య ఆరోగ్య సదుపాయాలు నీటి పారుదల సౌకర్యాలు విద్యుచ్ఛక్తి పరిశ్రమల ఫ్యాక్టరీలు మూలస్తంబాలుగ నిలుస్తాయి అన్నది మనం విస్మరించరానిది.

## అక్షరాస్యత వైద్య ఆరోగ్య సదుపాయాలు :-

శ్రామిక పెట్టుబడుల ఉత్పత్తి మాత్రమే భారీస్థాయి పారిశ్రామిక పెట్టుబడులు వినా రాణిస్తాయనటానికి లేదు. జపాన్ ఆర్థిక వ్యవస్థ బలమైనదనటానికి పెట్టుబడి శక్తి ఉత్పాదితక శక్తి రెండింటిని కలిగిన ఆర్థిక వ్యవస్థ అది అక్షరాస్యత వైద్య ఆరోగ్య సదుపాయాలు ఆర్థికస్థితిగతులలో నూటికి 100% అభివృద్ధి పొందిన దేశం జపాన్.

పలువురికి అవకాశాల పెంపుదల ఉత్పత్తుల పెరుగుదల వలన తప్ప పరిమిత దేశ జనాభా సాధించిన ప్రగతి వలన ప్రజాభ్యుదయం సాధించబడదు.

పారిశ్రామిక పెట్టుబడుల ఉత్పత్తుల్ని కలుగువేసే ప్రైవేట్ రంగం గిరాకీ సప్లయిల్ని వేగవంతం చేస్తాయి. తప్ప వీటిని తగ్గిస్తాయనడం ఆర్థిక శాస్త్రంలో పడికట్టి పదాలకు మనం విలువనిచ్చినట్లు అవుతుంది. నెహ్రూ సోషలిస్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థే మానవాళికి ప్రగతికి మణిదీపం.

## వ్యష్టి-సమిష్టి-వస్తూత్పత్తి సేవలు:-

''సోషలిజం'' ఇది ద్వివిధ అంశాలు-రెండు సిద్ధాంతాలకు ఈ రెండు మాటల కలయక ఒక భూమిక మార్కెట్ ఒకదానిలో స్వేచ్ఛా సమానత్వాలను చేపట్టేవి మరొక

వానిలో వ్యక్తుల ప్రతిభా సామర్థ్యాలకు అతీతంగా నిలచేవి. ఈరెండింటిలో వేటిని మనం విస్మరించిన మానవాళి నాగరిక దశ నుండి మరల ఆటవిక సంస్కృతికి దిగజారుతుంది.

పరిమిత భూకమతాల వలన పరిమిత యాజమాన్య శక్తి ఇచట ఉత్పత్తి శక్తిగ నిలవాలి. అతడే రైతు వ్యష్టి వ్యవసాయకోత్పత్తుల సాధనలో ఈ ఆర్థిక విదానం తప్పనిసరి స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానమిదియని సంబరపడటానికి వీలు లేదు. కారణం ఈ మార్కెట్ విధానం స్వయం పోషకముగ నిలవలేదు. ఇందుకు భారీస్థాయి పెట్టుబడుల పారిశ్రామిక పెట్టుబడుల ఉత్పత్తులు రాణించవు వెలకెక్కవు ఇందుకు కార్మికులు అగ్రభాగాన్న నిలుస్తాడు.

పారిశ్రామీక రంగం ప్రగతికి భారీ స్థాయిలో పెట్టుబడులు అవసరం ఇవి సమిష్టి పరముగానే ఉంటాయి. వ్యవసాయరంగ విస్తరణ పరిమిత శ్రామిక పెట్టుబడులు ఇవి వ్యక్తులు పరంగానే ఉంటేయి.

**సాంప్రదాయక వృత్తులు చేతియంత్రాలు :-**

ఇందువలననే దేశ సౌభాగ్యానికి రైతాంగం శ్రామికులు అవసరమని ఆర్థిక శాస్త్రం ఘోషిస్తుంది. ఈ ఇరువురికి సంతృప్తి సౌభాగ్యం ఇవ్వగలది సోషలిష్టు మార్కెట్ ఆర్థిక ఎకనమీ తప్పించి కేవలం స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం. ఇందుకు ఉపకరించదు అధిక ఉత్పాధికతను అమిత కొనుగోలు శక్తిని ఉత్పత్తి శక్తులకు పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం కలిగిలేదు. సాంప్రదాయక వృత్తులు చేతి యంత్రాలు దేశ ఆర్థిక వ్యవస్థను ప్రభావితం చేయుగలిగిన ఇవి ఎంతమాత్రం దేశ ఆర్థిక సుస్థిరతకు దీటుగ నిలువలేదు.

నెహ్రూ సామ్యవాద ఆర్థిక వ్యవస్థ తప్ప సమాజానికి మరోమార్గం లేదు. దేశ ఆర్థిక స్వావలంభనకు స్వయం సమృద్ధికి తోడ్పడగలది నెహ్రూ సోషలిసజమే రక్షణ మార్కెట్ వ్యవస్థతో(Protected market economy) మనం పరిమిత మార్కెట్ వ్యవస్థలో అడుగుబెట్టి ఇతర దేశాల ఆర్థిక వ్యవస్థలో తులతూగే దేశ ఆర్థిక వ్యవస్థను నెలకొల్పుకోలేము.

మనల్ని మనం ఎందులోను కుదించుకోరాదు. అందులో ఆర్థిక ప్రగతిలో కుంధించుకుందామన్న ప్రపంచ వర్తక వాణిజ్య పరిస్థితులు అందుకు సహకరించవు. ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వం గల ఏదేశము తన ఇరుగు పొరుగు దేశాల ఆర్థిక వ్యవస్థల్ని కాదని ఏ మాత్రం తన ఉనికిని మనుగడను వికసనల్ని పొందలేదు. అన్ని దేశాల ప్రపంచ వాణిజ్యసంస్థ (W.T.O.)తో ముడిపడి ఉన్నాయి. ఏ ఒక దేశం ఈ ముడిని విప్పిన ఆర్థికంగా క్రిందపడటం ఖాయం.

**మార్కెట్ సంస్కృతి :-**

ప్రపంచంలో గల దేశాలు ఏదో ఒక మార్కెట్ వ్యవస్థ పైనే ఆదారపడి మనగలుగుతున్నాయి. ఉత్పత్తి అమ్మకం కొనుగోలు మేరకు ఏర్పడు వినిమయ జీవన పద్ధతులు నుండి వ్యక్తి విడివడి మనగలగడి ఎలా పరస్పరం అన్నింట ఇచ్చిపుచ్చుకోవటం సంభవిస్తేనే సమాజం అనేది అవతరిస్తుంది.

సాంప్రదాయం మేరకు ఉత్పత్తి అమ్మకం కొనుగోలు జరగటానికి ప్రపంచదేశాల వత్తిడి సంబందము లేనపుడు సాధ్యం తప్ప అత్యాధునిక ప్రచార విజ్ఞాన సాధనలలో ప్రపంచం నేడు ఎంతగానో కుదించుకుపోతుంది. దూరతీర ప్రాంతాలనేవి ఏ ఒక్క చోటనే కూడి దగ్గర పడుతున్నవి. రవాణా ప్రసార సౌకర్యాలు అత్యంతాధునిక టెక్నాలజీ మన జీవనోత్పత్తి విధానాల్ని ఏనాడో మార్చివేసాయి. ప్రాచీన కాలం నండి ఆదిమ కాలం నుండి సమాజం ఏదో ఒక విదమైన మార్కెట్ వ్యవస్థకు లోనవుతూ వస్తున్నది. అత్యంతాధునిక జగతిగ నేడు మనం ప్రాచీన ఉత్పత్తి పద్ధతులను కొనుగోలు పద్ధతులను పట్టుకొని వేలాడబడగలమా.

**విషమ పరిస్థితి :-**

అంతరాల దొంతరాల గల సమాజం మనది. వనరుల పంపిణీ లో అసమానతల్ని ఎదుర్కొంటున్న విషమ సంస్కృతి -ఉచ్చులో పూర్వవైభవాలు వెదికిన మనకు లభించవు. ఇందుకు మార్కెట్ ఎకనమీ కావాలి. లేదా స్వేచ్ఛా ఆర్థిక విదానం కావాలి. ఒకటి మిత వాదం వేరకటి అతివాదం అని భారత ఏనాడో నెహ్రూజీ నేతృత్వములో మిశ్రమ ఆర్థిక వ్యవస్థను నెలకొల్పుకోగలిగింది. సంక్షేమ ఆర్థిక విదానాలకు పట్టం కడుతూ వస్తున్నది. ఏదో ఒక విదమైన మార్కెట్ వినిమయ జీవన సరళి సమాజంలో బాగా అల్లుకొని నాటుకొని పోతుంది. పెళ్లగించడం ఏ ఒకరి తరం కాదు.

**జీవన స్థితిగతుల్ని పెంచగలవి -పని సామర్థ్యం-వృత్తినైపుణ్యం:-**

దారిద్ర్యం- ఉపశమనం చెందాలి ఉద్యోగవకాశాలు కల్పించబడాలి జీవన నాణ్యతను పెంచాలి ఇందుకు జాతీయభిమానం జాతీయోద్రిక్తత ఉన్నసరిపోదు. వ్యక్తుల పనిసామర్థ్యం వృత్తినైపుణ్యం వినా ఇవి సాధించబడవు. ఉత్పత్తుల పెంపుదల వినా జీవన ప్రామాణికత సాధ్యపడదు.

సంకుచిత పరిధిలో స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విదానం వలన అధికాహారోత్పత్తులు సాధింపబడవు. సాంప్రదాయక వృత్తుల గృహ పరిశ్రమలు భారీస్థాయిలో వ్యవసాయ పరిశ్రమల్ని వృద్ధిపొందించలేవు. ఇందుకు వారికి తగిన ఆర్థిక స్తోమతలేకపోవడం మరొక వైపు తగిన గిరాకీ మార్కెట్ తగినంత స్థాయిలో

లభించక పోవడం కొనుగోలు శక్తిని పెంచుకోలేనివారు పొదుపు చేయనూలేరు. మదుపు పెట్టనూలేదు సాంప్రదాయం చాటున ఉత్పత్తి వినిమయం కొనుగోలు అంతగా లాభించవు. రాణించవు ఆధునిక రాష్ట్రీయ సాంకేతిక విద్యా సంక్షేమ ఆర్థిక విధానం మేరకు మిశ్రమ ఆర్థిక వ్యవస్థకు చోటు నివ్వనిదే అభివృద్ధి వేసిన చోటనే వేసినట్లుగ ఉంటుంది. నెహ్రూ ఆర్థిక విధానమే ఇందుకు మనకు శరణం గచ్ఛామి.

**''శరణం గచ్ఛామి'' :-**

తన ఆశయం మేరకు తనకేమి జరగటానికి లేదు. ''శరణంగచ్ఛామి'' సామాజిక రాజకీయ ఆర్థిక శక్తిలిందుకు ఎంతగానో సహకరించాలి. తగిన ఆర్థికాపేక్షను ఆసక్తిని తను కలిగిలేనిచో తన ఉనికి తన మనుగడ వికసనకు తను పునాది రాయిని తను వేసికోలేడు ఇందుకు సమకాలీన సమాజము నందలి వ్యక్తులలో తను కలిసి ఉద్యమించాలి. తనను స్వావలంభన దిశగ తీసికొని వెళ్తాయి.

నిరక్షరాస్యత నిండుగ ప్రవహిస్తున్న భారత్‌లో ఆరోగ్య వైద్య సదుపాయాల్ని అందుకోలేని ఈ సమాజంలో వ్యక్తులు ఎలా కొనుగోలు శక్తిని కూడగట్టుకోగలరు. ఎలా తగిన వృత్తినైపుణ్యం పని సామర్ధ్యంను పొందగలరు. స్వావలంభన దిశను ఎలా చేరుకోగలరు. తను చేస్తున్న ఉత్పత్తుల పరిణామం పరిమితం నాణ్యతకు కడు దూరం గిరాకీ సప్లయి అందుకోలేని దుస్థితి దేశ సరిహద్దుల్ని దాటని ఆర్థికాబివృద్ధి దేశీయుల్ని ఏదో జీవింపజేసిన జీవనాస్థాయిల్ని బాగా ఏమి పెంచలేదు.

**దేశ ప్రజల తలసరి ఆదాయంలో పెరుగుదల :-**

తలసరి లెక్క ఆదాయమంటేనే తికమకగ ఉంటుంది. దేశంలో జనాభా తలసరి ఆదాయం వ్యక్తిగత ఆదాయం పెరిగినట్లు లెక్కలో ఉంటుంది. నిజ జీవితంలో సమాజమున కనీస జీవన వసతులకు దూరంగ నిలిపే అభాగ్యులుగ అసంఖ్యాకులుంటారు. ఈ పరిస్థితి వలన ప్రతి ఒకరి తలసరి ఆదాయం పెరిగిందనటానికి అర్ధమే ఉండదు. ఒకడు కోట్ల కొద్ది ధనంను సంపాదిస్తున్న గొప్ప ఆదాయన్ని తెచ్చుకుంటాడు. మిగతా 99 మంది కనీస తలసరి ఆదాయం కూడ తెచ్చుకోలేడు. అయితే మొత్తం కోట్ల ఆదాయం అందరిది అని లెక్కవేసిన ప్రతి ఒకరు చాలినంత తలసరి.ఆదాయం అందుతున్నట్లు తెలుస్తుంది. ఇది లెక్కల వంచన తప్ప నిజమైనది కాదు.

అయినప్పటికి ఇటువంటి తలసరి ఆదాయం రెండింతలు అవటానికి ఇంగ్లాండు పౌరులకు 50 ఏండ్లు పట్టింది. అదే స్థాయిని అందటానికి అమెరికా పౌరులకు 40 ఏండ్లు పట్టింది.చైనాలో 10 ఏండ్లలోనే తలసరిఆదాయాన్ని ఎంతగానో పెంచుకోగలిగింది. తలసరి ఆదాయం పెరగాలన్న సంపూర్ణ ఉద్యోగావకాశాల కల్పన

జరగాలని స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానాన్ని చేపట్టాలని శ్రామిక పెట్టుబడుల ఉత్పత్తుల్ని సాధించాలని చెబితే సరిపోదు. అందుకు తగిన ప్రణాళికలుండాలి.

**పెట్టుబడులు ఎలా వస్తాయి:**

అదుపులేని నిరుద్యోగాన్ని ఆపటానికి దేశ ఆర్థిక వ్యవస్థలో ఉన్న బలమెంత! రెక్కలొచ్చి ఎగురుతున్న వస్తుధరలకు కళ్లెంవేయగలమన్న అధికోత్పత్తుల సాంప్రదాయక సామాజికోత్పత్తులపెంపు పిలుపు సాధ్యమేనా! పెట్టుబడులు ఎలా వస్తాయి! శ్రమ సంపద నుండి లభించాలి. పొదుపు చేయగలిగితేనే తప్ప జాతీయాదాయం పెరగదు. శ్రమ నుండి విలువ వస్తుంది. ఆ విలువ తన కనీస జీవన స్థాయికి దిగువనే ఉంటుంది. మిగుల విలువలు ఎలా లభిస్తాయి. పిండికి తగిన రొట్టే లభిస్తుంది. తప్పతిండికి తగిన రొట్టెకి సరిపడ పిండి లభించదు.

ఇందుకు స్వదేశీ పరిమిత మార్కెల్ ఆర్థిక విధానం మనకు ఉపకరించదు. భారీస్థాయిలో పెట్టుబడులు పెట్టగల ప్రభుత్వరంగం ప్రభుత్వ రంగానికి పోటీగ నిలచి వర్తక వాణిజ్యాల్ని వృద్ధిపరచగల ప్రైవేటురంగం రెండూ దేశ ఆర్థిక వ్యవస్థలో ప్రధాన భూమికల్ని పోషించాలి. ఉత్పత్తుల్లో పెంపుదల కేవలం నైపుణ్యం వ్యక్తి సామర్థ్యం పెరిగినందున దఖలుపడదు. ఇందుకు తగిన గిరాకీ సప్లయిల్ని విడుదల చేయగల దేశ విదేశీయ మార్కెట్ అదారిటీ కావాలి.

**కోట్లు కొలది పెట్టుబడులు కావాలి:-**

పరిమిత స్వదేశీ మార్కెట్ ఆర్థికవ్యవస్థలో పెట్టుబడు లభించడం అంత తేలిక అయిన విషయం కాదు. మౌళిక సదుపాయాల కల్పనకు ఏటా మన దేశానికి కనీసం 60వేల కోట్లు పెట్టుబడి కావాలి. పెట్టుబడులనేవి మిగుల విలువల నుండి లభించగలవి స్వదేశీ పెట్టుబడులు అంతంత మాత్రమే.

కారణం సాంప్రదాయక వృత్తుల పనిపాట్లలో ప్రావీణ్యత ఉన్న ఆధునిక శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానంలో దేశప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ఇంకనూ వెనుకబడే ఉన్నారు. విద్యాగంధం ఉన్నను ఆరోగ్య వసతుల అంతంత మాత్రమే. ఆర్థిక పుష్టి ఎలా వస్తుంది. విదేశీ పెట్టుబడులు వినా దేశ ఆర్థిక వ్యవస్థకు మాయ మంత్ర దండంతో మనం మార్చలేం. భౌగోళికరణ స్వదేశీ సరళీకృత ఆర్థిక విధానం. ఒకటేనని మాయ మాటలు చెప్పిన అవి చెల్లవు.

**త్రిమూర్తులు :-**

స్వదేశీ పరిమిత ఆర్థిక విధానం వలన మనం 1. ప్రపంచబ్యాంక్ 2. అంతర్జాతీయ ద్రవ్యనిధి 3. ప్రపంచ వాణిజ్య సంస్థ ఈ త్రిమూర్తుల్ని మనం అధిగమించలేం. దేశంలో ఒకవైపు మెగా ప్రాజెక్టు విద్యుచ్ఛక్తి ఉత్పత్తుల్ని భారీపెట్టుబడులతో

పారిశ్రామికంగా ముందడుగు వేస్తూ మరొక ప్రక్క స్వదేశీ ఆర్థిక విధానం పేరిట సాంప్రదాయక వృత్తుల్ని చేపట్టడం తదుపరి ప్రయాణం మనల్ని ఒడ్డుకు చేర్చదు.

నీటిని సద్వినియోగం చేసికోవాలన్న భూమిని పూర్తిగ వినియోగంలోనికి తెచ్చుకోవాలన్న సహజవనరుల్ని మనం స్వాధీనం పరచుకోవాలి. భారీస్థాయి పెట్టుబడులు వినా ఇది సాధ్యపడదు. పబ్లిక్‌రంగం ప్రాధాన్యతను పొందినగాని వీటిని మనం సాధించలేం. అయితే ప్రైవేట్ రంగం నుండి ఇవి పై దొలగిన ఇక వీటిపై హక్కు భుక్తాలు వ్యక్తులకు ఎలా లభిస్తాయని కొందరు ప్రశ్నిస్తారు.

**ఉత్పత్తి శక్తులు - యాజమాన్య శక్తులు :-**

ఇందుకు ప్రజాప్రయోజనాల్ని వ్యక్తుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని రెండింటిని సమపాళ్లలో సాధించగల ఆర్థిక విధానం అవసరం. ఉత్పత్తి శక్తులకు యాజమాన్య శక్తులుగ సమపాళ్లలో ప్రాతినిధ్యం చేయాలి. ప్రైవేట్ రంగం పబ్లిక్‌రంగం మించి ఉదార ఆర్థిక విదానాల్ని మనం చేపట్టాలి. సోషలిష్టు సమాజ పునర్నిర్మాణానికిది రాచబాట అవుతుంది. నెహ్రూ సోషలిజం తప్ప ఇందుకు గత్యంతరం తప్ప పరిమితి స్వదేశీ మార్కెట్ ఆర్థిక విదానం ఎంతమాత్రం కొరగాదు.

**స్వదేశీ సరళీకృత ఆర్థిక విధానము సరిపడదు:-**

నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీని కాదని కొందరు మౌలిక సదుపాయాల రంగంలో విదేశీ పెట్టుబడులను ఆహ్వానించాలని వినిమయ రంగంలో స్వదేశీ ఆర్థిక సంస్థల పెట్టుబడులు ఉండాలని ఆశిస్తారు.

ఇది ఆశావహమే తప్ప ఆచరణలో జరిగేది కాదు. విదేశీ ఆర్థిక సంస్థలు తమ పెట్టుబడుల్ని మన దేశంలో పెట్టడం వాటి స్వీయ సౌభాగ్యా లాభాపేక్షలకు తప్ప మన దేశ ఆర్థిక వ్యవస్థను బాగుపరచడమే తమ ధ్యేయంగ పెట్టుకోవు. మన పెరడులో చెట్టునాటి పండ్లను కోసికొని వారింటికి తీసుకొనిపోవ జూస్తారు. వాటాలు లాభాలు అంతిమ ఆశయాలు మేరకు అవి పనిచేస్తాయి. వాటిని మనం నిర్దేశించలేం. అవి విదేశీ ఆర్థిక సంస్థల అందుకు అవి బహుళజాతి ఆర్థిక సంస్థలు జాతీయమైన అగ్రరాజ్యలకు అండగ ఉండగలవి.

ఈ సంస్థలకు పుట్టిన పుత్రికలు భౌగోళికరణకు ప్రధాన మార్గాలు 1. ప్రపంచ బ్యాంక్ 2. అంతర్జాతీయ ద్రవ్యనిధి 3. ప్రపంచ వాణిజ్యసంస్థ స్వదేశీ సరళీకృత ఆర్థిక విదానమని వీటిని వినియోగ రంగంలోనికి తప్పించి మౌళిక సదుపాయాల రంగంలోనికి రానివ్వమని చెప్పినంత మాత్రాన వీటి పధకాల్ని అమలు చేయకుండా ఇవి ఉండవు.

## మార్కెట్ చోదక ఆర్థిక వ్యవస్థ :-

నిజానికి మార్కెట్ చోదక శక్తి ఆర్థికాభివృద్ధికి గీటు రాయిగ నిలుస్తాయి.స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం ఇందుకు చుక్కెదురు. ప్రజల కనీస అవసరాల సాధనకు కార్యాచరణ ప్రణాళిక ఉండాలన్నది స్వదేశీ ఫలాసఫీ. ప్రణాళిక అనగానే కంట్రోల్ ఎకనమీ రంగంలో ప్రవేశిస్తుంది. మార్కెట్ చోదక ఆర్థిక వ్యవస్థ అనగానే స్వేచ్ఛా మార్కెట్ వ్యవస్థ అవతరిస్తుంది.

అందుకు మన దేశ ఆర్థిక వ్యవస్థను స్వీకరించి సరిదిద్దగల శక్తి నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీ ఉంటుంది. తప్ప స్వదేశీ పరిమిత మార్కెట్ ఎకనమీ ఎంత మాత్రం ఉపకరించదుగాక ఉపకరించదు.

పబ్లిక్‌రంగం తగని భారాన్ని దేశ ఆర్థిక వ్యవస్థకు మోపుతుందనడం ప్రైవేటురంగం మంచిదనటం సరికాదు అసమర్థత వలన విదానాల్ని అమలుపరచడంలో అశ్రద్ధ నిర్లక్ష్యం వలన నెహ్రూ ప్రణాళిక ఆర్థిక విధానం తప్పుగ కన్పించగలదేమో తప్పించి నెహ్రూ సోషలిజం కాల పరీక్షకు తట్టుకొని నిలచిన శాస్త్రీయమైన ఆర్థిక విదానం దేశానికి దిక్సూచి నెహ్రూ సోషలిష్టు విధానమే తప్ప స్వదేశీ ఆర్థిక విదానం ఎంత మాత్రం కాదు.

## స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం-సరిపోదు:-

ప్రపంచ దేశాలలో ఏ ఒక దేశం స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విదావాన్ని అమలు పరచి తన దేశ ఆర్థిక వ్యవస్థను తీర్చిదిద్దికొట్లున్నట్లుగ దాఖలాలు ఏమిలేవు. ఆసియా దేశాల్లో జపాన్ స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానమునకు చిహ్నమని చెప్పిన అది చెల్లదు. ఉత్పత్తులచట గృహపరిశ్రమలుగ విస్తరించిన భారీస్థాయిలో జరిగే దేశ విదేశీ మార్కెట్లను అజ్మాయిషీ చేయగలుగుతున్నది. అక్షరాస్యత గలది ఆరోగ్య వైద్య సదుపాయాల్ని ఆర్థికాభివృద్ధిని గల జపానీయులు సరియైన వృత్తి నైపుణ్యం పని సామర్థ్యంతో అందెవేసిన చేతులు ఉత్పత్తులు ఏ స్థాయిలో జరుగుతున్నది కాదు ఎంత స్థాయిలో అవి గిరాకీ సప్లయిలను నోచుకుంటున్నవి, ప్రధానం. పెట్టుబడి దేశాలలో జపాన్ అందెవేసిన చేయి నేడు శ్రామిక ఆర్థిక వ్యవస్థతో సరితూగ గల ఆర్థిక వ్యవస్థను రూపొందించుకొన్నది.

వినియోగరంగంలో ప్రవేశించి విదేశీ ఆర్థిక సంస్థలు తగిన లాభాల్ని త్వరలో తెచ్చుకొని అవసరమైన మూట ముడులు సర్దుకొని వారి స్వదేశాలకు చిత్తగిస్తాయి. ఒక వేళ సదుపాయాల కల్పనలో వీటికి చోటు నిచ్చిన అతికాలయాపనలో పనిచేస్తాయి తప్ప వెంటనే కార్యసాధనకు తలపడవు.

## సోషలిజం ''ఫార్ములా'' పని చేయుగలది:-

ఇందువలన మన దేశ ఆర్థిక వ్యవస్థలో ఒడుదుడుకులు సంభవిస్తాయి. ఇటువంటి ఆర్థిక వైపరీత్యాల్ని తట్టుకోవాలనే సోషలిజం ఫార్ములా రూపొందించబడినది. మనదేశ ఆర్థిక వ్యవస్థలో పబ్లిక్ ప్రైవేట్ రంగాలకు సరిసమాన ప్రాతినిధ్యాన్ని పొందగలుగు తున్నందున్న విదేశీ ఆర్థిక సంస్థల వలన మన దేశ ఆర్థిక వ్యవస్థలో అంత వేగం తీవ్రంగ ఎటువంటి కష్టనష్టాలు జరగవు. ఒక వేళ దేశ ఆర్థిక వ్యవస్థ స్వదేశీ పరిమిత మార్కెట్ ఎకనమీ దఖాలుపడుతున్న విదేశీ ఆర్థిక సంస్థ వలన రాటుపోటుల్ని అందగలిగినదిగనే ఉంటుంది. తప్పించి వాటిని అధిగమించ దేశ ఆర్థిక వ్యవస్థను ఇది తీర్చిదిద్దలేదు.

ఇందుకు ప్రత్యామ్నాయముగ కాలగమనంలో నిలచిన ఉత్తమ శాస్త్రీయ ఆర్థికవిధానముగ ఆచరణలోని నిలద్రొక్కుకున్న సోషలిష్టు మార్కెట్ ఆర్థిక విధానము నెహ్రూ సోషలిజమే దేశానికి శరణ్యం శిరోదార్యం నెహ్రూ సోషలిజమే సరియైన సంక్షేమ ఆర్థికవిధానం.

## వ్యవసాయరంగం భారీస్థాయి పెట్టుబడులు:-

రైతాంగం తమ శ్రమ విలువ మేరకే వారి జీవనస్థాయిని కుదించడం క్షమించరాని ఆర్థికనేరం కారణం నేటి రైతాంగం పెట్టుబడుల సామర్థ్యం లేక సాంకేతిక విజ్ఞానం అందక వృత్తినైపుణ్యం కొరవడి దిక్కుమాలిన స్థితిలో ఉంది. భారీస్థాయి వ్యవసాయ సంస్కరణల్ని చేయాలి. ఆధునిక యంత్రపరికరాల్ని ప్రవేశపెట్టి వ్యవసాయరంగాన్ని పునర్వ్యవస్థీకరించాలి. మరనాగలి విద్యుత్ నీటి పంపుసెట్లు ట్రాక్టర్లు వినియోగంచనిదే వ్యవసాయరంగంలో అధికాహారోత్పత్తులు లభించవు.

75% రైతాంగానికి 1-హెక్టార్లకు మించిన భూకమతాలు ఉండవని భారీస్థాయిలో ఆధునిక యంత్రపరికరాల్ని రంగంలో ప్రవేశపెట్టలేమని స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానమని నక్కు నాగలి పశుశక్తి మానవ శ్రమను వినియోగించుకుంటూ బ్రతకమని ఇంకెన్నాళ్ల వీరిని దేశానికి వెన్నుముక రైతాంగం ''అని మోసగించ గలం'' పాత తరహా ఉత్పత్తి విధానాలు యాజమాన్య పద్ధతులు మారితేనే తప్ప వ్యవసాయరంగం బాగుపడి బట్టకట్టలేదు. కమతాలు చిన్నవనటం సరికాదు చిన్న సన్నకారు రైతాంగం వేరు వేరుగ ఉంటూనే ఉమ్మడి పద్ధతిపై ఆధునిక యంత్రాల్ని వినియోగించుకోగలదు. అందుకు తగిన వేతన విలువల్ని చెల్లించగల స్థోమత కలదు.

భారీస్థాయి సమిష్ట పెట్టుబడులతో వ్యష్టి వ్యవసాయకోత్పత్తుల్ని విరివిగ నేడు సాదిస్తున్న పంజాబ్ బీహార్ రైతాంగం స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విదానాన్ని తలదన్ని సోషలిస్టు మార్కెట్ ఆర్థిక విదానానికి సంకేతముగ నేడు నిలుస్తున్నది.

**చిన్న తరహా పరిశ్రమలు- ఉన్నతిని ఎలా సాధించగలవు:-**

లఘు పరిశ్రమలు చేతివృత్తులు - చేనేత పరిశ్రమ సాంప్రదాయ వృత్తులు ఎన్నాళ్లగనే శ్రమిస్తున్న నోటికింత తిండి దొరకడం గగనకు సమమంగ ఉంది. వారు వినియోగిస్తున్న పరికరాలు తరతరాలుగ వస్తున్న పరికరాలు అధికోత్పత్తులకు సరిపోవు ఉత్పత్తులలో నాణ్యతను సాధించలేనివి. చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధి ఎలా సాధ్యం స్వదేశీ పరిమిత మార్కెట్ వ్యవస్థ వలన వీటికి పునరుజ్జీవనం లభించదు.

దేశ జనాభా అత్యల్ప సంఖ్యలో ఉన్న - అతి ప్రాచీన కాలమున - వస్తూత్పత్తిని రూపొందించిన ఈ సాధనాలు అత్యధిక జనాబాగల దేశానికి సమృద్ధిగ వస్తుసంపదలను అందించలేదు. ఆర్థిక పెట్టుబడులు సాంకేతిక విజ్ఞానం కేవలం సోషలిజం సోషలిష్టు మార్కెట్ ఎకనమీలోనే సాధ్యం ఈ ఆర్థిక విధానమే వీటికి శ్రీరామ రక్షగ నిలుస్తుంది హోదాలేనిదే ఉత్పత్తులలో ప్రామాణికత ఉండదు. ఉత్పాదికతలో నాణ్యత ఉండదు.

**కుటీర పరిశ్రమలకు ఆధునిక టెక్నాలజీ ఉండాలి:--**

ఇక అజ్ఞానం- అవిద్య ఆర్థిక పుష్టిలోపించిన గ్రామీణ ప్రాంతంలో చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధి సున్న అవుతుంది. తప్ప ఉన్నతిని సాధించలేదు. ఉత్పత్తులతో నాణ్యత భారీస్థాయి కొనుగోలు జరగనిదే పెట్టుబడులు లభించినదే ఎలా సాధ్యం పరిమిత సంఖ్యలో అయిన ఉత్పత్తులకు భారీస్థాయి మార్కెట్‌లో ఎలాలభిస్తాయి. కుటీపరిశ్రమలకు ఆధునిక టెక్నాలజీ ఉండాలి. దీనిని వినియోగించుకొనే నైపుణ్యం సామర్థ్యం పెట్టుబడి శక్తి శ్రామిక వర్గానికుండాలి.

స్వదేశీ సాంకేతిక విజ్ఞానం స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిలో తాబేలునడక రప్పించి వృద్ధి రేటును పెంచుకోలేదని అనిన మన చేనేత పరిశ్రమ రంగమే ఉధాహరణ.

# 6వ ప్రకరణం
# దేశీయ ఆర్థిక వ్యవస్థ

## ''మార్కెట్'' ఆర్థిక వ్యవస్థను దాటి పోలేదు:-

మన దేశ ఆర్థిక వ్యవస్థే కాదు ఏ దేశ ఆర్థిక వ్యవస్థయైన మార్కెట్ ఆర్థిక వ్యవస్థను దాటిపోలేదు. వస్తూత్పత్తి సేవల వినిమయ పంపిణీలు వినా ఏ సమాజం కొనసాగదు. వీటి నుండి ఏ సమాజం బయటపడిన బాగుపడదు.

ఇందువలన మార్కెట్ వ్యవస్థ అన్న లాభనష్టాల ప్రాతిపదికగ నడిచే వ్యవస్థ అన్నమాట కేవలం నీతి పాఠాల్ని వల్లించడం వలన హిత భోధనల వలన మానవుని ఆర్థిక కార్యకలాపాలు విస్తరించవు. వ్యక్తుల సహజాతాల వలన సహజమైన ప్రకృతి సంపదలవలన వ్యక్తులు సమాజం వస్తూత్పత్తి సేవలలో నిమగ్నమవుతారు.

పెట్టుబడులనేవి-వాటి అవధుల మేరకు అవి పనిచేస్తాయి. తప్ప స్వదేశీ స్వావలంభన పేరున ఆదేశిస్తే అవి ఆదేశించబడవు. పెట్టుబడుల్ని మనం దశదిశా నిర్ధేశనం చేయలేం. అవి ఫలితాల్ని వ్యక్తుల ఆర్థిక శక్తుల ప్రేరణ ఉత్పాదనల వలన అవి అల్లుకుంటాయి.

## ప్రజలకు భాగస్వామ్యం ఎలా సాధ్యం :-

దేశ సంక్షేమం అనేది అసంఖ్యాక సామాన్య జనుల సుఖసంతోషాల మేకు ఉంటుంది. వారి జీవనస్థాయిని పెంచని దేశ ఆర్థిక సుస్థిరత సంక్షేమ సాధనకు అర్థమే ఉండదు. అత్యధిక శాతం ప్రజలకు భాగస్వామ్యం కల్పించని దేశ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి వాపు తప్ప బలుపుగ ఉండదు.

మన దేశ 96కోట్ల జనాభాలో 50% మించి అక్షరాస్యులు లేరు. అభివృద్ధి ఎలా సాధ్యమౌతుంది. మన దేశ జనాభాలో 30% నిర్ధనికులు ఆర్థిక పుష్టిలేని వారున్నారు. అభ్యుదయం ఎలా పట్టువడుతుంది. 1980కి దారిద్ర రేఖకు దిగువనున్న వారి సంఖ్య 45% పెట్టుబడుల సామర్థ్యం మనకు ఎక్కడ నుండి వస్తుంది. నెలవారీ స్థిరాదాయం రానివారు అసంఖ్యాలుగ ఉన్నారు.

## 1: 5 నిష్పత్తుల తేడా ఉంది:-

ఇందుకు తోడు గ్రామీణ ప్రజల జనాభా ఆదాయం ఒక వంతుగ నిలస్తే పట్టణ ప్రజల జనాభా ఆదాయం ఐదువంతులు వీరి సంఖ్య 1:5 నిష్పత్తుల తేడా ఉంది. అల్పాదాయ వర్గాల వారు అధిక జనాభా పల్లె ప్రాంతాల్లోనే ఉన్నారు. మనది పల్లె భారతి

అధిక జనాభా శ్రామిక పెట్టుబడుల ఉత్పత్తులతో ప్రొద్దుపుచ్చుతున్నారు. శ్రమకు తగిన విలువల్ని తెచ్చిపెట్టని వ్యవసాయకోత్పత్తులు సాంప్రదాయక వృత్తుల వలననే సన్నగిల్లుతున్నాయి.

### గ్రామీణ భారతి ఇంక అధోగతిలో ఉంది:-

తరతరాలుగ స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్ధిక విదానమును చేపడుతూ వస్తున్న మన గ్రామీణ భారతి ఆర్ధిక దుస్థితి నేటికి వర్ణనాతీతము. 1. వృత్తినైపుణ్యం పనిసామర్ధ్యము కొరత 2. తలసరి నికరాదాయం అతిస్వల్పం 3. ఆకలి నిరుద్యోగం హెచ్చు 4. వినిమయ సంస్కృతికి దూరంగ నిలచిన దేశీయ సంస్కృతి దివ్య తేజస్సు దిగజారింది. 5. కనీస సామాజిక అవసరాల కల్పన కథగానే మిగిలింది. 6. శ్రామిక పెట్టుబడుల ఉత్పత్తులు అంతంత మాత్రమే. 7. బ్రతకటానికే వృత్తులు బాగుపడటానికి కావు అన్న నమ్మక విశ్వాసాలు 8. కుటీర పరిశ్రమలకు సాంప్రదాయక వృత్తులకు విద్య విజ్ఞానం లేకపోయిన విస్తరిస్తాయి అన్న మూఢనమ్మకం 9. వైద్య ఆరోగ్య సదుపాయాలంటూ ప్రత్యేకమైన శ్రద్ధ తీసికోవడమేమిటో తెలియని అమాయక పల్లెజనం 10. చాలీచాలని భూవసతి 11. తమ శరీరాల్ని సేవా రూపాలుగ మలచుకోవడం తప్పించి వేరే ఉత్పత్తి సాధనాల జాడే తెలియనివారు 12. ఆధునిక టెక్నాలజీ సాదన సంపత్తి లేనివారు-పల్లెల హీన దీన స్థితికి కారణాలు.

ఇన్ని విధాలుగ వెనుకబడిన గ్రామీణ ప్రాంతం ప్రజల ఆర్ధిక స్థితిగతులు స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్ధిక విధానం బాగుపరచకలదా। విద్యా విహీనులు అనారోగ్య పీడితుల పెట్టుబడులు లేనివారు నిస్సహాయకులు నిజ జీవితంలో నిలచి నిలువెత్తు రూపంలో నడిచి ఏమి సాధించగలరు. నిరాశ నిస్పృహలు, నిర్వేదం, జీవితం, అశాశ్వతం అన్న మెట్ట వేదాంతం తప్ప- అదృష్టంపై ఆశతో జీవించే దురదృష్టవంతులు.

### స్వదేశీ పరిమిత మార్కెట ఆర్ధిక విధాన సంకెళ్లు:-

వస్తూత్పత్తి సేవల్ని మనం రక్షించలేము వాటికవి రక్షించబడాలి. వీటిని రక్షించే ప్రాచీన పద్ధతులు పై గల విశ్వాసాల నమ్మకాలు పూర్తివమ్ము అయిపోవాలి. బాగుపడటానికి చెడిపోవటానికి భౌతిక కారణాలుగ కాక వేరే ఇతర కారణాలున్నాయని విశ్వసిస్తూ వస్తున్న గ్రామీణ భారతి కళ్లు తెరచి నిజజీవన స్థితి గతులను తెలిసికోవటం-ప్రథమముగ భారతదేశములో కాంగ్రెస్‌పార్టీ అమలుపరచిన సామ్యవాద తరహా సమాజ నిర్మాణంలోనే ప్రారంభమైనది. నెహ్రూజీ నవభారత నిర్మాతగ పిలవబడటం జరిగింది. స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్ధిక విధాన సంకెళ్ళ నుండి గ్రామీణ భారతిని విడిపించింది. నెహ్రూ సోషలిజం కాంగ్రెస్ పార్టీ పాలనతో దేశంలో కాంతి పథం ఏర్పడింది.

## సహజ వనరుల సద్వినియోగం :-

మన సహజ వనరులు భూమి నీరు అయితే వీటి సాగు సంపదలను సద్వినియోగంలోనికి తెచ్చుకోవాలన్న స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం ఇందుకు ఉపకరించదు. భారీస్థాయిలో ప్రణాళిక పెట్టుబడుల వినా వీటిని మనం వినియోగంలోనికి తెచ్చుకోలేము. కేవలం నెహ్రూ సోషలిజంలోనే ప్రణాళిక పెట్టుబడుల వినా వీటిని మనం వినియోగంలోనికి తెచ్చుకోలేము. కేవలం నెహ్రూ సోషలిజంలోనే ప్రణాళిక పెట్టుబడులు లభిస్తాయి. ప్రణాళిక ఆర్థిక విధానం అవసరం.

నిరక్షరాస్యత ఒక వైపు జనాభా ఒత్తిడి వేరొకవైపు అనారోగ్యం మరొక వైపు అమాయకత మూఢ విశ్వాసం అవిద్య అజ్ఞానం వీటిని తొలగించాలన్న తొలగించుకోవాలన్న సామ్యవాద తరహా సమాజ నిర్మాణ సాధన తప్ప వేరే మార్గం లేదు. సంక్షేమ ఆర్థిక విధానాల్ని చేపట్టాలి. ప్రభుత్వరంగం వలననే సంక్షేమ చర్యలు ఆర్థిక విధానాల్ని చేపట్టాలి. ప్రభుత్వరంగం వలననే సంక్షేమ చర్యలు భాగస్వామ్యం అవకాశాలు కల్పనకు ప్రైవేట్‌రంగం అవసరం. నెహ్రూ సోషలిజమ్ ఇందుకు సాధన తరుణోపాయం. దేశీయ అంతర్జాతీయ స్థాయిలో మార్కెట్లను విస్తరింపజేసికొని ప్రపంచదేశాల వస్తూత్పత్తి సేవల్ని మన అంతర్జాతీయ ఎదుర్కొనగలిగితేనే తప్ప దేశ సహజ వనరులు సహజ సంపద వృద్ధిలోనికి రాదు. రానే రాదు. అధికస్థాయిలో పెట్టుబడులు భారీస్థాయిలో ప్రణాళికల్ని అమలుపరచినగాని దేశ సంపదను సద్వినియోగ పరచుకోలేము.

ఉమ్మడి సంపదలకు ఊపిరినిస్తేనే తప్ప సమాజ పరముగ అభివృద్ధి అభ్యుదయము అందలేము. ప్రధాన మౌళిక పరిశ్రమల్ని జాతీయం చేస్తేనే తప్ప దేశ జాతీయదాయం దేశ ప్రజలెల్లరికి అందుబాటులోనికి రాదు. పరిమిత శ్రామిక పెట్టుబడులు భారీప్రణాళికల్ని అమలుపరచలేము. ప్రజా పెట్టుబడుల వలన తప్పించి ప్రజలెల్లరికి సుఖశాంతులు లభించవు. రవాణా వార్త ప్రసార సౌకర్యాలు ఏ కొద్ది మందికో చెందినవి కావు. సమాజమునగల ప్రజలెల్లరికి సంక్రమించగలవి ఉమ్మడి సౌభాగ్యం ఉమ్మడి పెట్టుబడి వలననే సాధ్యం. ఇందుకు పబ్లిక్ ప్రైవేట్‌రంగాల ఉమ్మడి కృషి అవసరం.

## నిర్బంధ ప్రాథమిక విద్య :-

''పడికట్టు''పని ఉపకరించదు. అత్యంతాధునీకరణ గల పారిశ్రామిక రంగం అవతరించాలి. పారిశ్రామిక ప్రగతిని దోహద పరచగల నవీన పద్ధతులలో కొనసాగగల వ్యవసాయక విధానాలు అమలుకావాలి. వ్యవసాయం ఆధునికీకరణ జరగాలి నిర్బంధ

ప్రాథమికవిద్య విధానాన్ని అమలుపరచి ప్రజల శక్తి సామర్థ్యాన్ని పెంచి వారి ఉత్పాదికత శక్తిని వృద్ధిపరచాలి. లభిస్తున్న లభించగల ఆదాయం అవకాశాల్ని బట్టి మన జీవన విదానాలేర్పడతాయి. తప్పించి మన జీవన విధానాల మేరకు ఏర్పడే అవకాశాల ఆదాయాలు శాస్త్రీయ పరమైనవిగ ఉండవు. ఆర్థిక కేంద్రీకరణ కూడనిదని అనడం ఇది అత్యదిక సంఖ్యాకుల ప్రయోజనాల్ని దోపిడి పీడనలకు గురి చేస్తుంది అలానే వికేంద్రీకరణ పేరుతో వ్యక్తుల చేతుల్లో నిడిన సమాజ సౌభాగ్యం సంతకు వెళ్తుంది.

## ఆరోగ్యం వైద్యం రవాణా వార్తా ప్రసార సౌకర్యాలు:-

దేశ ప్రజల పేదరికం కూడు గుడ్డ వసతి లభించినంత మాత్రాన సమస్య తీరదు. ఇందుకు తోడు విద్య ఆరోగ్యం వైద్యం రవాణా వార్తా ప్రసార సౌకర్యాలు విస్తరించాలి. వీటిని స్వదేశీ స్వావలంభన ఆర్థికవిదానం వలన సాధించలేము. ఆర్థిక సుస్థిరతను అంగీకరించి ఉమ్మడి పెట్టుబడుల ఆధిక్యత ఉంటేనే తప్ప వీటి ని రూపొందించుకోలేము. సామాన్యుల పురోగతిని ఉపకరించని ఆర్థిక సంస్కరణల వలన దేశానికి ఖ్యాతి రాదు. జన సామాన్యునికి ఏమి ప్రయోజనాలు లభించవు. ఇందుకు నెహ్రూ సోషలిజం సోషలిస్టు మార్కెట్ ఎకనమీ అత్యంతావశ్యముగ నిలుస్తుంది. ఎల్లరి సుఖశాంతులకు కారణమిది.

## మౌలిక జన జీవన అంశాల సద్వినియోగం:-

శారీరకంగ ఎంత శ్రమించిన సాధించింది పరిమితమే ఇందుకు యంత్ర శక్తి విద్యుచ్ఛక్తి తోడ్పడిన వస్తూత్పత్తి కేవలో గణనీయమైన వృద్ధి కన్పిస్తుంది. శ్రమ విభజన పని విభజన శక్తి సామర్థ్యాలు మేరకు జరగాలి. తప్పించి ప్రాచీన వృత్తుల మేరకు జరగరాదు. ప్రాచీన వృత్తుల్ని పటికట్టు పద్ధతులు నడిపిన పరిష్కారం కాగల ఆర్థికాంశలేముంటాయి.

విదేశీ వలసల్ని నిరోధించినంత మాత్రాన శ్రామిక పెట్టుబడుల ఉత్పత్తుల్ని రెండింతలు చేసిన ప్రాధిమికోత్పత్తుల్ని ఆధునీకరణ చేసిన ఫలితాలు అంతంత మాత్రమే తప్ప అఖిల జనావళికి ఆర్థిక పరిపుష్టినిచ్చే అవకాశాలు సంతృప్తిగ లభించవు. కారణం వలస వచ్చిన వారిలోను వృత్తినైపుణ్యం సామర్థ్యం తొంగి చూస్తాయి. ఉత్పత్తులు సంభవిస్తాయి.

ఎద్దుల బండిని గుర్రపు బండిలా నడిపించాలన్న కుదరదు బండి ఒకటయిన ఎద్దు గుర్రం పనిపాటలో ఒకటిగ నుండవు వేగమొకటి బరువు ఒకటి ఈ రెండు సమతూకంగ నడవవు. ఇక నక్కు నాగలిని ఆధునికరణ చేయులేము. పూర్తిగ వీటి స్వరూప స్వభాల్నే మార్చాలి ట్రాక్టర్- విద్యుత్ మోటార్ ప్రవేశించాలి.

## వృత్తులు- ఉపవృత్తులు:-

స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక వ్యవస్థ నేడు పతనమై సోషలిస్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థ పుంజుకుంటూ పోతుంది. ఇందుకు ఉదాహరణ ఒకనాటి గృహవృత్తులు సాంప్రదాయక వృత్తులు క్రమేపి భారీస్థాయిలో విస్తరిస్తూ భారీస్థాయి వస్తూత్పత్తి సేవలకు కేంద్రాలుగ విస్తరిస్తున్నాయి. వ్యవసాయం చేయడం ఒక నాటి కులవృత్తి కులపరంగ నడిచేది నేడు అది భారీస్థాయి పెట్టుబడులతో అధికాహారోత్పత్తుల్ని వాణిజ్య పంటల్ని పండ్లతోటల్ని పెంచి పోషించే దిశగ పరుగెత్తుతున్నది. విదేశాలకు వ్యవసాయ ఉత్పత్తుల్ని పంపిణీ చేసే భారీస్థాయి వస్తూత్పత్తి కేంద్రాలై వెలుస్తున్నాయి.

వ్యవసాయం కులవృత్తిగ ఉన్న కొన్ని వేలలో తప్ప సంవత్సరం పొడుగున వ్యవసాయం కొనసాగదు. ఆరు మాసాలు పనులు ఆరు మాసాలు విడిదిగ ఉంటుంది. వ్యవసాయ రాబడులలో కనీసజీవన పరిస్థితులకు నోచుకోలేని రైతాంగం ఆదాయ కోసం గొర్రెలు-కోళ్లు పెంచడం పాడి ఆవుల్ని చేపల్ని పెంచడం ఉపవృత్తులు పెట్టుకొనే వారు.

## ఇక ఉపవృత్తులు అనేవి కొనసాగనే కొనసాగవు:-

వృత్తులే క్రమేపి ఆర్థిక వ్యవస్థను తట్టుకోలేక మాసిపోతున్నవి. ఇక ఉపవృత్తులు అనేవి కొనసాగనే కొనసాగవు. ఇందువలనే ఒకనాడు ఉపవృత్తులుగ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం మేరకు కొనసాగిన కోళ్ల పెంపకం నేడు ఫౌల్ట్రీగ మారింది పశువుల పెంపకం డయిరీ ఫారంగ అవతరించింది. చేపల చెరువులు చేపల ఉత్పత్తి కాలువులుగ వెలసాయి (Fish Tanks) వడ్రంగి ఫర్నీచర్ షాపులుగ అవతరించాయి.

ఇవన్నీ ఆర్థిక వ్యవస్థకు కేంద్రీకరణ - పెట్టుబడులకు అంకురార్పణ లగ నిలుస్తున్నాయి. కుటీర పరిశ్రమల నుండి వీటిని భారీస్థాయి పరిశ్రమలగ ఎగిరి గంతేసేలా చేస్తాయి.

వీటిని మరల స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం మేరకు యథాతథంగ పూర్వ రూపంలో నిలపటానికి ఆదరణ పేరున ఉత్పత్తి సాధనాల్ని అందించడం ఆర్థిక వ్యవస్థను మరల వెనుకకు త్రిప్పగలమన్న భ్రమ తప్ప వేరేమి కాదు ఈ పథకం ఎందుకు కొరగాని నిష్ప్రయోజనంగ ఆధ్యతన భావిలో నిలుస్తుంది.

# 7 వ ప్రకరణం
# సామాజిక పంపిణీ / సామాజిక న్యాయం

## స్వదేశీ పరిమిత మార్కెట్ ఎకనమీ :-

సోషలిష్టు మార్కెట్ ఎకనమీ పారిశ్రామికంగ ముందడుగు వేస్తున్న పరిమిత మార్కెట్ ఎకనమీలో పడి పల్లెలు వెనకబడుతూనే ఉన్నాయి. దేశ ఆర్థిక వ్యవస్థను మనం విభజించలేం. అయినా పల్లెపట్టణ ఆర్థిక వ్యవస్థలు భిన్నముగ నిలుస్తాయి.

పల్లెల్లో జీవించే వారి తలసరి ఆదాయం ఒక వంతు అయితే పట్నంలో ఉన్నవారి తలసరి ఆదాయం ఐదువంతులు. అల్పాదాయ వర్గాల వారు అచట ఇచట ఉన్న ఇచట అచటత అమితాదాయ వర్గాలవారుంటారు.

అందుకు తలసరి ఆదాయం అనేది అర్థం పర్థం లేని వ్యర్థ పదార్థం వంటిది. ప్రజల జీవన స్థితిగతుల్ని వాస్తవంగ ఇది చెప్పలేద. ఉదా. పల్లె జనాభా వెయ్యిమంది అందు స్వల్పాదాయం వారి సంఖ్య 800 మంది, అమితాదాయ వర్గం వారి సంఖ్య 10 మంది వారి తలసరి ఆదాయం నూటికి భాగించడం ఏమి బావ్యముగ ఉంటుంది. అసహజం పలువురి దారిద్రాన్ని విభజించి చూపక కొద్ది మంది వ్యక్తుల భాగ్యాల్ని అందరి తలలపై లెక్కకట్టి చూపడంలో అర్థం లేదు.

## అధోగతి పురోగతి:-

గిట్టుబాటు కాని జీవన వృత్తుల్లో చిక్కుకొని ఉంటారు. పల్లె ప్రజానీకం తరతరాలుగ వస్తున్న నిర్బంధ జీవన వృత్తుల్లో ఉంటారు. విదలించుకొని బయటపడలేదు పట్టణ ప్రజీనీకం తన జీవనవసరాల్ని తీర్చే ఏ వృత్తికి అయిన సిద్ధపడతారు. చేస్తున్న పనికి గాక పల్లెలోని ప్రజలవలె అందుకుగాను వస్తున్న ఆదాయం ప్రతిఫలం మేరకు పట్నం జనం ముందుకు అడుగువేస్తారు. ఒకటి అధోగతి మరొకటి పురోగతి పరిమిత ఆర్థిక విధానం పరిధిలోనే వీరు ఉంటారు. నెహ్రూసోషలిష్టు మార్కెట్ ఆర్థిక విధానం నిత్యం పరిపూర్ణ అవకాశాలనిచ్చి ఆర్థిక ప్రతిఫలముగనే నిలుస్తుంది. ఇందుకు పట్టణాలు విద్య-వైద్య- ఆరోగ్య వార్త రవాణా ప్రసార సౌకర్య విజ్ఞానాన్ని ఆధునిక యంత్రసామాగ్రి విరివిగ వీరికి అందుబాటులో ఉంటాయి. సాంప్రదాయక వృత్తులకు పట్టణాలు దూరంగా ఉంటాయి పారిశ్రామిక ఉత్పత్తులకు పల్లెలు అందుబాటులో ఉండవు-కులవృత్తులు చేతువృత్తులతో కూలబడి ఉంటారు.

## సామాజిక న్యాయం :-

స్వయం సమృద్ధిని పుష్కలముగ సాధిస్తేనే తప్ప వ్యక్తికైన సంఘానికైన స్వయం పోషక శక్తి అలవడదు లభించదు. ఈ సమృద్ధి అనేది వస్తూత్పత్తి సేవల మొత్తమే కదా। ఎవరి శక్తి యుక్తుల మేరకు వారి వారి జీవన విధానాలుండాలి. వారి జీవనస్థాయి వారి శ్రమ విలువకు దాటి ఉండరాదు. స్వీయ పెట్టుబడి శ్రమ మేరకు వారి జీవితాల్ని వారు మలచుకోవాలి వారిఆదాయంనకు మించిన కొనుగోలుశక్తి వారు కలిగి ఉండరాదు కలిగిఉన్నసమాజంనందలి ఇతర వ్యక్తుల కొనుగోలు శక్తినివారు హరించిన వారవుతారు.

ఒక్క మాటలో చెప్పాలన్న ఎవరికి వారు స్వయం కృషి ఫలితములతో వారు బ్రతకగలగాలి. ఇతరులపై ఆధారపడి ఏందులోను జీవనం కొనసాగించరాదు. వ్యక్తుల స్వయం పోషకులుగ నిలవాలి. వ్యక్తులెల్లరు స్వయం పోషకులుగ నిలచిన సమాజం స్వయం పోషక ఆర్థిక విధానమునకు నిలువెత్తు రూపముగ నిలుస్తుంది. ఇందుకు ఉపకరించ గలది సోషలిష్టు మార్కెట్ ఎకనమీ - పరిమిత మార్కెట్ ఎకనమీ వల్ల సాధ్యం కాదు.

## వ్యక్తులెల్లరు సరిసమాన ప్రతిభాసామర్థ్యాల్ని కలిగి ఉండరు:-

వ్యక్తులెల్లరికి సరిసమాన ప్రతిభా సామర్థ్యాలున్న నిజానికి దీనికి మించిన ఆర్థిక విధానముండదు. సమాజమున అవివేక బలహీనతలు అనేవి లేకున్న దీనికి మించిన ఉత్తమ ఆర్థికత ఉండదు. కాని దురదృష్టవశాత్తు- లేక ప్రకృతి సిద్ధ సహజ స్వభావాల వలననో వ్యక్తులెల్లరు సరిసమాన ప్రతిభాసామర్థ్యాల్ని కలిగి ఉండరు. అవివేక బలహీనతల్ని కలిగినవారు అసంఖ్యాకంగ ఉంటారు. సమాజంలో-

శక్తియుక్తులి కలిగినవారు తమ ఆర్థిక అవసరాల్ని ప్రతిభా సామర్థ్యాలతో నెరవేర్చుకొని ఆదాయం కొనుగోలు శక్తితో జీవన స్థాయిని పెంచుకొని సుఖశాంతులతో జీవిస్తారు. అవిద్య అజ్ఞానంను కలిగినవారు తమ నిజ జీవితావసరాల్ని అవివేక బలహీనతల వలన నేరవేర్చుకోలేక స్వల్పాదాయంతో కొరవడిన కోనుగోలు శక్తితో తమ దారిద్ర్యరేఖలో దిగువ స్థాయిలోకి దిగజారి దుర్భర జీవితాన్ని గడుపుతారు.

## అవివేక బలహీనులు దోపిడీ పీడనలకు గురి అవుతారు :-

సమాజమునగల వ్యక్తులెల్లరికి స్వయం పోషకశక్తి యుక్తుల్ని కలిగిస్తే మంచిదే అయితే అందుకు తగిన నిర్బంధ విద్యా విదానమేది వృత్తినైపుణ్యం పెట్టుబడుల సామర్థ్యం పెంచే వృత్తి నైపుణ్య కళాశాలలేవి? రాజకీయ ఆర్థికవనరుల పంపిణీలో సరిసమానతలేవి? అట్టడుగు వర్గాల వారిని అణచిపెట్టి తరతరాలగ వారిని దోపిడీ పీడనలకు గురిచేస్తూ వారిని సాంఘిక రాజకీయ ఆర్థిక ప్రయోజనాలకు దూరంగ

నిలపటమే సాంఘికన్యాయమా! వారి జీవితాన్ని చక్కదిద్దగల విద్యకు వారిని ఎంతో దూరంగా తరతరాలుగ నిలిపే అసాంఘిక శక్తులను ఆపలేమా!

వ్యక్తులకు స్వేచ్ఛా సమానత్వం హక్కుల పేరిట ప్రతిభాసామర్థ్యాలున్న వారు వీటిని కలిగిలేని ఈ అవివేక బలహీనులను దోపిడీపీడనలకు వారు గురి చేయని ఆర్థిక విధానమే ''నెహ్రూ సామ్యవాద తరహాసమాజ నిర్మాణం''.

దేశ వనరుల వినియోగాన్ని ఒక వైపు ప్రైవేట్‌రంగం ద్వారా వ్యక్తుల ప్రతిభా సామర్థ్యాల్ని వినియోగించుకుంటూ వేరొక వైపు పబ్లిక్‌రంగం ద్వార అవివేక బలహీనులకు సంక్షేమ ఆర్థిక విధానాల్ని అమలుపరచగలది నెహ్రూసోషలిజం ప్రైవేట్‌రంగం దోపిడీపీడనల్ని అరికట్టగలది పబ్లిక్‌రంగం ఇది లేనిచో ప్రైవేట్‌రంగం స్వైరవిహారం అన్నింట చేస్తుంది. ప్రైవేట్‌రంగం లేనిచో పబ్లిక్ రంగం నియంతగ వ్యవహరిస్తుంది. ఈ రెండు ఉమ్మడిగ-సమైక్యపడినడిస్తేనే ఉమ్మడి సంపద వ్యక్తిగత సంపద రెండు విస్తరిస్తాయి. సామాజిక న్యాయం సిద్ధిస్తుంది. సామాజిక పంపిణి ఫలిస్తుంది.

## భారత జాతీయ దృక్పధం అలవడాలి:-

ఒకే జాతి అదే భారతజాతి భారతదేశమున శాశ్వతంగ వర్ధిల్లగలది. భారతీయులు భారతజాతికి చెందినవారే భారతీయ సంస్కృతి దేశ ప్రయోజనాలు సంకుచిత స్వాలంభన దిశలోగాక బహుళజన ప్రయోజన సిద్ధిని కలుగుజేయాలి. శిక్షణ సంస్థలు విద్యాసంస్థలు సంకుచిత జాతీయభిమానంతోగాక విశాల భారత జాతీయ దృక్పధంతో ముందడుగు వేయాలి.

స్వీయ ప్రతిభా సామర్థ్యాల్ని విస్తృతపరచే స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం దేశంలో వెనుకబడిన వారిని దళితులను దగా పరుస్తుంది. తరతరాలుగ దోపిడీ పీడనలకు గురియైన వారిలో నేటికి వృత్తినైపుణ్యం లోపం పనిసామర్థ్యంలో అవిద్య అజ్ఞానం కొట్టివచ్చినట్లు కన్పిస్తాయి. ఇటువంటివారిని మీ మేరకు మీ శక్తి యుక్తుల మేరకు స్వేచ్ఛగ మీకు మీరు బ్రతకండని చెప్పడం ప్రజావంచన మోసం అవుతుంది.

సమాజంలో అత్యధిక భాగముగ నిలచిన వారిని అన్ని విధాల ఆదుకోవటానికి స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విదానాన్ని తలదన్నిన నెహ్రూ సోషలిజం అమలుకావాలి సంక్షేమ ఆర్థిక విధానాల్ని అమలుపరచాలి. నెహ్రూ సామ్యవాద తరహా సమాజ నిర్మాణానికి మార్గం చూపాలి సామాజిక పంపిణి సరిపోదు సామాజిక న్యాయం అన్నింటా కావాలి. ప్రతిభా సామర్థ్యాల్ని విస్తరింపజేస్తుంది. ప్రైవేట్‌రంగం-అవివేక బలహీనలతల్ని పోగొడుతుంది. పబ్లిక్‌రంగం ఈరెండింటి మేలు కలయిక సాంఘికన్యాయం.

**కలిమి లేమికి కర్తలు :-**

సమాజంలో కొందరికి విందు భోజనం మరి కొందరికి భోజనమే అందని స్థితి ఏ ఆర్థిక విధానం అంగీకరించరాదు. ఉన్నవాడు తింటాడు లేని వాడు చస్తాడు. కలిమి లేమికి కర్తలు మనం కామన్నది పూర్వీకుల నానుడి తప్ప ఆర్థిక సూత్రాలిందుకు అంగీకరించవు. కలిమికి-లేమికి-మనబలము మన పని తనమే కారణం.

సమాజాన్ని అసమానతలకు గురిచేసే వ్యక్తులు మనకొద్దు వ్యక్తులలో సరిసమానతల్ని సిద్ధింపజేసే ''సమాజం'' మనకు కావాలి. సమాజమున గల వ్యక్తుల ప్రతిభాసామార్థ్యాలు మన సంఘంలోగల అవివేక బలహీనతల్ని పారద్రోలేవిగ ఉండాలి. తప్పించి అవివేక బలహీనులను దోచుకొనేవిగ ఉండరాదు. అందుకు కేవలం వస్తూత్పత్తి సేవల్ని కేవలం సామాజిక పంపిణీ పరముగ నిలిపిన ప్రయోజనం ఉండదు. వీటిని సామాజిక న్యాయం ప్రతిఫలించేవిగ సామాజిక పంపిణీ జరగాలి. (Social distribution)

**శ్రమ సంపదకు మూలం ''సమాజం'':-**

తనకు భాగస్వామ్యం లేని దేశ సౌభాగ్యంలో తనకున్న జీవనస్వామ్యం తనకు తగనిది అవమానకరం దుర్భరం. బానిసత్వం వ్యక్తులను సమాజ శ్రేయస్సుకు మూలకారకులుగ నిలపదు. సామాజిక శక్తిని యుక్తిని తక్కువ అంచనా వేయడమే అవుతుంది. శ్రమ సంపదకు మూలం సమాజం తప్ప వ్యక్తి ఎన్నటికి నిలవడు. అసలు సంపదే సామాజిక పరమైనది వస్తూత్పత్తి సేవలకు విలువలనేవి వ్యక్తి పరంగ సిద్ధించవు సమాజ పరముగ వీటి విలువలు నిర్ణయించబడతాయి. విలువలనేవి ఉపయోగితలను బట్టి ఏర్పడతాయి వస్తువుల బట్టి ఏర్పడవు.

ఇందువలన సమాజమునగల అసమానతల్ని పారద్రోల వ్యక్తులెల్లరిని ఇందుకు సిద్ధపరచాలి స్వావలంభన శక్తి స్వయం పోషక యుక్తి ఉన్న ఏ కొద్ది మందికో చెందిన స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థికవిధానముగాక సమాజమున గల ఎల్లరిని స్వయం సంకల్ప సిద్ధులుగ పరిపూర్ణులుగ రూపొందించే ఆర్థిక విధానము గల సోషలిష్టు మార్కెట్ ఎకనమీని స్వాగతించి దేశ ప్రజలెల్లరికి ''సువర్ణాభిషేకం'' జరిగేలా చూడాలి.

**ఉద్యోగాల కల్పన :-**

దేశస్థాయిలో సాంఘిక సౌకర్యాల కల్పన- వైద్య విద్య ఆరోగ్య సదుపాయాలు అవకాశాలు ఉద్యోగాల కల్పన పెట్టుబడులకు తగిన ఉత్పత్తుల్ని అధికం చేయడం ప్రజా ప్రయోజనాల విస్తరణ సాంఘిక ప్రయోజనాలు దేశ సౌభాగ్యం అసమానతలు లేని సమ సమాజం సోషలిష్టు మార్కెట్ ఎకనమీలో సాధ్యం తప్ప స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం ఎంత మాత్రం సమాజమునగల అసమానతల్ని తొలగించలేదు. సాంఘిక న్యాయాన్ని తెచ్చిపెట్టలేదు. సహజవనరులను తగిన రీతిలో సాంఘిక పంపిణీ చేయలేదు.

# 8వ ప్రకరణం
# భౌగోళికరణ - ఏక ధ్రువ ప్రపంచం

## తప్పనిసరి ప్రపంచ ఆర్థిక వ్యవస్థ సంకెళ్లు:-

తృతీయ ప్రపంచ దేశాలు పూర్తిగ బహుళజాతి సంస్థల ఆర్థిక ఆదిపత్యం క్రింద చేరుకుంటున్నాయి. ఇండియా సరళీకృత ఆర్థిక విధానంతోపాటు స్వేచ్ఛా విఫణి ఎగుమతుల దిగుమతుల సరళీకరణ అన్ని రంగాలలో ప్రవేశపెట్టుకొనేస్థితికి వచ్చింది. ప్రపంచ బ్యాంకు నుండి మనదేశమే కాదు అప్పు తీసికొనని దేశం ప్రపంచములో లేదు అనిని అతిశయోక్తి కాదు. ఈ అప్పు అంతర్జాతీయ ద్రవ్యనిధికి మన ఆర్థిక శక్తి దాఖలాలు కనపరిస్తేనే తప్ప అప్పు పుట్టదు. ఇలా తీసికొన్న అప్పును మరల చెల్లించాలన్న అంతర్జాతీయ ద్రవ్యచెలామణిలో ఉన్న ద్రవ్యం(విదేశీ కరెన్సీ) రూపంగ తప్ప మన రూకలు చెల్లిస్తామన్నా సరిపోదు. ఇందుకు సరిపడ వస్తూత్పత్తి విలువల్ని మన దేశ సరకుల్ని విదేశాలకు ఎగుమతి చేస్తూ చెల్లించాలి. ఇందుకు ఉద్దేశించినదే ఒకనాటి గాట్‌నేత డంకెల్ పేర జరిగిన ఒప్పందం నేటి ప్రపంచ వాణిజ్యసంస్థ(W.T.O).

## ఆర్థిక వ్యవస్థ భౌగోళీకరణ:-

ఇందువలన మనదేశీయ ఆర్థిక వ్యవస్థ భౌగోళీకరణకు అతి చేరువులో ఉండాలి. తప్పించి మేమందులో భాగస్వాములము కామన్న కుదరదు. ప్రపంచ బ్యాంకు అప్పుల్నివ్వదు. అప్పు లేకున్న మన ఆర్థిక వ్యవస్థ చప్పున కూలిపోతుంది. స్వావలంభన స్వయం సమృద్ధి అని చాటడం తప్పించి ప్రపంచ భౌగోళీకరణలో మనం భాగస్వామ్యం గల కష్ట సుఖాలనంద వలసిందే లాభనష్టాల్ని పొందవలసిందే.

## డంకెల్ ఒప్పందం స్వదేశీ పరిమిత-మార్కెట్ ఆర్థిక వ్యవస్థ:-

ప్రపంచ మార్కెట్ వ్యవస్థలో పోటీచేయలేని స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక వ్యవస్థ తన దేశీయ ఆర్థిక స్థితి గతుల్ని ఎలా పెంపొందించుకుంటుంది. డంకెల్ ఒప్పందం మేరకు ఎగుమతులు దిగుమతులపై 30% మించి ఏ ఒక దేశం మన దేశంతో పాటు ఎక్సైజ్ డ్యూటీని విధించరాదు. ఎగుమతుల్ని దిగుమతుల్ని నిర్దేశించడం మన వల్లకాని పని దేశీయ పరిశ్రమలకు మనం రక్షణలను కల్పించడమనేది నేడు డంకెల్ ఒప్పందలో లేదు. గాలిలో కలిసిపోయింది ఇక స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక వ్యవస్థను మనమెలా సంరక్షించుకోగలము. ఒక వేళ మన జీవన స్థాయి ప్రమాణాల్ని మనం ఏ జాతీయభిమానంతోనో- ఏ ఉద్రేక స్వభావంతోనో మన తగ్గించుకో దలచిన మనకు అది సాధ్యం కాదు-స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక వ్యవస్థ పరిమితులలో

మన పయనిస్తేమన్న అది మన వల్ల కాదు-పరుగెత్తడం ప్రారంభించాం. నిలచిన మనం సమకాలీన ఆధునిక కాల గతిలో కొట్టుకొని పోతాం మరి మనకు పట్టు దొరకదు. మనబతుకులు గట్టి పడవు.

**నెహ్రూ సోషలిష్టు మార్కెట్ వ్యవస్థకు ఎన్నడు ఢోకా ఉండదు:-**

ప్రపంచ దేశాలను కాదని మనమన్నింట స్వయం పోషకులమని నిలవటానికి లేదు. దేశ జనాభాకు నేడు కూడు గుడ్డ వసతి ఉన్న సరిపోదు. సకల భోగ భాగ్యాలు వస్తు సంపదలు కావాలి. దేశ ప్రజ ఆశిస్తుంది. ఇతర దేశాలతో వర్తక వాణిజ్యాల్ని నెలకొల్పుకొననిదే ఇందులో మనం కృత కృత్యులం కాలేము కదా। ఇందువలన తప్పుడు నెహ్రూ మార్కు సోషలిష్టు ఎకనమీ అన్నది పాతమాట. నెహ్రూ సోషలిష్టు మార్కెట్ వ్యవస్థకు ఎన్నడు ఢోకా ఉండదునేటి నెహ్రూ సోషలిజమే దేశానికి శరణ్యం శిరోధార్యం.

రాజకీయ సార్వభౌమాధికారం కలది సామ్యవాద ఆర్థిక వ్యవస్థ గుత్తాధిపత్యానికి గుర్తు పెట్టుబడి దారీ ఆర్థిక వ్యవస్థ. ఈ రెండూ ఆర్థిక వ్యవస్థలు మనదేశానికి సరపడవని నెహ్రూ సోషలిష్టు సమాజం గాక సోషలిష్టు తరహా సమాజ నిర్మాణం జరగాలని తనదైన సోషలిష్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థకు రూపకల్పన చేసారు. దానినే మనం మిశ్రమ ఆర్థిక వ్యవస్థగ పిలవవచ్చును. ఏనాడో నెహ్రూ నెలకొల్పిన బాటలో ఈనాడు ప్రపంచ దేశాలు ముఖ్యముగ కమ్యూనిష్టు దేశాలు నడవసిద్ధపడుతున్నాయి నెహ్రూ నిజానికి నవ యుగ సిద్ధాంత వేత్త.

**ప్రభుత్వ ద్వంద్వ ధరల విధానం :-**

దోపిడీ పీడనలు పబ్లిక్ రంగం ప్రైవేట్‌రంగం ఏరంగంలో జనించిన వేరొక రంగం వాటిని అణచివేస్తుంది. ద్వంద్వ ధరల విధానం వలన వస్తూత్పత్తి వినిమయంలో సమతౌల్యం లభిస్తుంది. దేశ ప్రజలకు ఒక రంగం పబ్లిక్ రంగం సమాజ నిర్మాణానికి శ్రేయోరాజ్యస్థాపనకు కృషిచేస్తుంది. మరొక రంగం ప్రైవేట్‌రంగం వ్యక్తుల స్వేచ్ఛా సమానత్వాలకు ప్రాణం పోసికాపాడుతుంది. ఒక రంగం సమాజంలో గల అవివేక బలహీనతల్ని పారద్రోలుటకు సంక్షేమ ఆర్థిక విధానాల్ని చేపడుతుంది. మరొక రంగం ప్రతిభా సామర్థ్యాలకు చక్కని రాచబాట వేస్తుంది. వ్యక్తులలో చొరవ ఉత్సాహం పట్టుదల ప్రతీకలను ఒక రంగం పోషిస్తే వేరొక రంగం వ్యక్తులెల్లరికి సరిసమాన అవకాశాల్ని కల్పించ సాంఘిక సంక్షేమ విధానాల సౌకర్యాల కల్పనను సిద్ధపరుస్తుంది. స్వేచ్ఛావాణిజ్యం వద్ద (Free market) నియంత్రణ ఆర్థిక విధానం వద్దు (Controlled economy) సోషలిష్టు మార్కెట్ ఎకనమీ కావాలి సామ్యవాద సమాజం సాధ్యం కాదు సామ్యవాద తరహా సమాజ నిర్మాణం జరగాలి.

## సేవారంగ విస్తరణ జరగాలి:-

గనిలో పనిలో కార్ఖానాల్లోను మరియు ఇతర రంగాలలోను జరిగే వస్తూత్పత్తి సేవల (Goods and Services) విలువలన్నింటిని స్థూల జాతీయం అంటారు.

మన దేశంలో వ్యవసాయం తత్సంబంధిత రంగాల్లోనే మన ఆర్థిక వ్యవస్థకు హెచ్చు ఆదాయం లభిస్తుంది. ప్రథమ స్థానము దీనిదే దేశ ఆర్థిక వ్యవస్థకు పరిశ్రమ రంగం నుండి లభించేది ద్వితీయస్థానము.

ఇక తృతీయ స్థానము సేవారంగానిది ఈ రంగం విస్తరించబడినగాని విద్యవైద్య ఆరోగ్య సదుపాయాలు సంక్షేమ ఆర్థిక విధానాలు వార్తా రవాణా ప్రసార సౌకర్యాలు ఇతర వ్యవసాయక పారిశ్రామిక రంగాల్లో అభివృద్ధి ఉండదు. సేవారంగం విస్తృత స్థాయిలో స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక వ్యవస్థలో రూపొందుటకు అవకాశమే లేదు. ఇందుకు పబ్లిక్‌రంగం సంస్థలు విస్తరిల్లాలి- ప్రైవేట్‌రంగ సంస్థల్ని నెలకొల్పు కోవాలి. దోపిడీ పీడనల్ని ఒకటి అదుపు ఆజ్ఞలలో నిడుతుంది. వేరకటి స్వేచ్ఛా సమానత్వం హక్కుల్ని నిలబెడుతుంది.

ఇందువలన సమాజం నందలి మానవ వనరులన్ని పూర్తి వినియోగంలోనికి తేబడతాయి. సహజ వనరులన్ని సమాజాభివృద్ధికి చక్కగ వినియోగింపబడతాయి. నెహ్రూహా సోషలిష్టు మార్కెట్ ఎకనమీలోనే ఇది సాధ్యమౌతుంది.

ఏ దేశంలోనైన- ఏ రంగంలోనైన వ్యక్తులలో ప్రతిభా సామర్ధ్యాల్ని వెలికి తీయుగలవి విద్య- ఆరోగ్యం సంక్షేమ విధానం వృత్తినైపుణ్యం పనిసామర్థ్యం పెంపుదల కానిచో ఉత్పాదిత శక్తిని ద్విగుణీకృతం చేసికోలేం.

## నిర్బంద ప్రాథమిక విద్యను అమలుపరచాలి:-

కనీసం నిర్బంధ ప్రాథమిక విద్యను అమలుపరచుకోని ప్రభుత్వం వైద్య ఆరోగ్య సదుపాయాల్ని విస్తరింప చేసికోలేని ప్రభుత్వం వ్యక్తులలో ప్రతిభాసామర్ధ్యాల్ని పెంచనూలేదు. తన స్థూల జాతీయదాయాన్ని వృద్ధి పరచుకొననులేదు. విద్య- శిక్షణ ఆరోగ్య పరిరక్షణ భారీస్థాయిలో జరిగి భారీ వ్యయానికి తట్టుకోవలసి ఉంది. తగిన ఉపాధి అవకాశాల సృష్టికి తగిన రీతిని ఖర్చుపెట్టగల ఆర్థిక స్థితిలో దేశమున్న గాని తన పేరునకు తగిన శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానాన్ని అందించలేదు.

ఇందుకు స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం ఎందుకు పని చేయదు. పబ్లిక్ రంగం విస్తరించనిదే ప్రజా విద్య ప్రజారోగ్యం సిద్ధించదు. ఇందుకు సోషలిష్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థకు రూపకల్పన జరగాలి సేవారంగాల్ని విస్తరించగల ఆర్థిక శక్తి యుక్తుల్ని కలిగినది యుండగలది. సోషలిష్టు మార్కెట్ ఎకనమీ.

## దేశీయ ఆర్థిక వ్యవస్థ-పొదుపు-పెట్టుబడి:-

పొదుపు నిజానికి పెట్టుబడులకు మార్గం పరిమిత కొనుగోలు శక్తిని అందించగల స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం పొదుపునకు పట్టాభిషేకం చేయలేదు. జీవన స్థాయిని మించిన కొనుగోలు శక్తి వినా వ్యక్తి అయిన దేశమైన పొదుపు చేయలేదు ఉత్పాదన శక్తి నైపుణ్యం లేని వ్యక్తులకు అధిక కొనుగోలు శక్తి ఎలా అబ్బుతుంది.

స్వదేశీ పెట్టుబడుల మొత్తంలో పెరుగుదల గాక తరుగుదల కన్పించిన దేశ ఆర్థిక వ్యవస్థ దిగజారుతుంది. విదేశీ పెట్టుబడులు ఇందువలన మనకు అంత సులువుగ లభించవు : విదేశీ ఆర్థిక సంస్థలు ముందుకు వచ్చి ఆర్థిక ఋణ సౌకర్యాల్ని అందించాలి.

ఆధునిక సాంకేతిక యంత్ర సామాగ్రి పరికరాల్ని దిగుమతి చేసికొననిదే అధిక వస్తూత్పత్తి సేవలకు అవకాశం ఉండదు. ఇందుకే మనం దిగుమతి విలవలను కరెన్సీకి వస్తు రూపంలో చెల్లించడం ఇందుకు స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక వ్యవస్థ సరిపడదు తట్టుకోలేదు దీని వస్తూత్పత్తి విలువలు సరిపోవు.

## ప్రపంచ స్వేచ్ఛా మార్కెట్ :-

విభిన్న ఆర్థిక వ్యవస్థలుగల దేశాలు పరస్పరం ఆర్థిక సహకార సద్భావాల్ని అందించు కొనగలవని చరిత్ర ఋజువు చేసింది. మనపరిశ్రమలు వ్యవసాయ రంగం దేశ విదేశీయ అంతర్జాతీయ పోటీని తట్టుకొని నిలబడగలగాలి తప్పించి పారిశ్రామిక వ్యవసాయక రంగాల్లో రక్షణ లనిచ్చి వీటిని కాపాడటానికి నేటి మన భౌగోళీకరణ త్రయం 1. ప్రపంచబ్యాంక్ 2. అంతర్జాతీయ ద్రవ్యనిధి 3. ప్రపంచ వాణిజ్య సంస్థ సుతరామూ (W.T.O) అంగీకరించవు అంతర్జాతీయ నిబంధనలను నియమాలను మనం దాటిపోలేము. వీటి నుండి మనం ఆద్యతన భావిలో మనం తప్పించుకోలేం-

ఇప్పటికి మనదేశం విదేశీ అప్పుల గొప్పల డప్పుల పరిష్వంగంలో చిక్కుకుంది. ప్రతి పనికి పెట్టుబడులకు మన శ్రమ నుండి లభించిన మిగుల విలువలనుండి గాక అప్పు చేసి పప్పు కూడు పెడుతున్నామని సిగ్గుగ చెప్పుకొనే దురావస్థకు దిగజారాం విచిత్రం ఏ మన- ఇది మన దేశ అదృష్ట రాశి ఫలంగా ప్రచారం చేస్తున్నాం.

## స్వదేశీ ఆర్థిక ఫిలాసఫీ వెలకెక్కి ఇలలో నిలవలేదు:-

పెట్టుబడుల కోతలో ఉత్పత్తి శక్తుల బలహీనతలో విదేశీ ఆర్థిక వ్యవస్థను తట్టుకొని ప్రపంచమార్కెట్ వ్యవస్థలో మనగలగలేవు. స్వదేశీ ఫిలాసఫీ ఇలలో నిలవలేదు. ఇందుకు బలీయమైన సోషలిస్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థ తప్ప మనకు

వేరే మార్గం లేదు. ప్రపంచ స్వేచ్ఛా మార్కెట్ ఎకనమీ నియంత్రణ ప్రణాళికా ఆర్థిక విధానము రెండింటి సమతౌల్యానికి నేడు స్వర్ణోత్సవాలు జరుగుతున్నాయి.

ఉద్యోగావకాశాల్లో ఉత్పత్తులల్లో అభివృద్ధిలో ఏదైన లోపాలున్న అవినె్ర్రహా సోషలిష్టు మార్కెట్ ఆర్థిక విధానంలో గల లోపం వలన కాదు. 1. జనాభా ఒత్తిడి వలనను 2. నిరక్షరాస్యత వలనను 3. శాస్త్రీయ సాంకేతిక ప్రగతికి దూరంగ మసలడం వలనను జరిగి ఉండాలి ఆర్థిక విధాన లోపం వలన మాత్రం కాదు. ఇన్నేండ్లు మన అనుభవం వలన తెలిసి వచ్చిన ప్రధానలోపాలివి.

### దేశీయ పరిమిత సరళీకృత ఆర్థిక విధానం-సరిపడదు-సరిపోదు:-

ఎంత స్వదేశీ అభిమానం జాతీయత మాటల్లో కొట్టివచ్చినట్లు కన్పించిన మన జీవన స్థాయిని పెంచలేని ఆర్థిక విధానాల్ని మనం సమర్థించలేం. ఉన్నచోటనే ఉట్టిపడేలా జీవించలేం గడపలేం మనకు నేడు అందుబాటులో ఉన్న వస్తు సేవల పరిణామం పరిణితి నాణ్యత చాలా తక్కువని మనం నిదర్శనాల్ని చూపనవసరం లేదు సర్వేలు ఇందుకు సాక్షులుగ నిలుస్తారు.

అయిన మనం మన జీవన స్థాయి ప్రమాణాల్ని వీటి మేరకు కుదించుకోవాలన్న అది తిరోగమన విదానమే అవుతుంది. ఇది ఆర్థిక వ్యవస్థను పుంజుకొనేలా చేయదు. నాసిరకం వస్తూత్పత్తి సేవల్ని మనం తొలగించుకోవాలన్న పోటీతత్త్వం ఉండాలి. ఇది మార్కెట్ వ్యవస్థలోనే సాధ్యం స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానంలో పోటీ మార్కెట్ వ్యవస్థ ఉంటుంది. అయితే సరిసమాన నైపుణ్యం శ్రామికపెట్టుబడుల సామర్థ్యాల మధ్యనే ఉంటుంది. అయితే అమితస్థాయిలో గాక అధమ స్థాయిలో పోటీ వలన స్పర్థ అభిలాషలు చెలరేగవు. ఆర్థికాబివృద్ధిని గట్టి పరచవు. రెండు చేతులు కలిసినంత మాత్రాన శబ్దం రాదు-శబ్దం వచ్చేలా మనం స్పందించే శక్తి యుక్తుల్ని సంధింపచేస్తేనే జరుగుతుంది.

దేశీయ సంజనిత సరళీకృత ఆర్థిక విదానం అంతర్జాతీయ స్థాయిలో ఏ విధంగను వెలకెక్కలేదు. స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానంలో ఉదార ఆర్థిక విధానాలకు తావేలేదు. జీవన స్థాయి ప్రమాణాల్ని పెంచని దేశీయ సరళీకృత ఆర్థిక విధానం సోషలిష్టు మార్కెట్ ఆర్థిక విదానానికి ఏందులోను సరిపోదు సాటిరాదు.

అధిక అనవసర వేతనాల్ని పనిచేసే వారికివ్వనవసరం లేదనటం అభివృద్ధి నిరోధనానికి ఒక సూచిక అసలు వేతన నిర్ణయం మన అబీష్టం వలన ఆశయం మేరకు జరిగే పనిగ ఉండదు. వస్తూత్పత్తి సేవల గిరాకి సప్లయి మేరకు జరుగుతుంది. అందుకే మన దేశ ఆర్థిక వ్యవస్థ ఒక నాడు కనీస జీవన వస్తూత్పత్తిని కల్పించ లేక సతమతమౌతున్నాయి. దానిని దాటి నేడు అపరిమిత ఆర్థిక సుఖ సౌఖ్యాల్ని అందించడానికి అప్పుల పాలవుతుంది.

## దేశీయాభిమానం జాతీయాభిమానం:-

జాతీయ-దేశీయత సంస్కృతి పరిరక్షణ పేరుతో నిలబెట్టినది ఆర్థిక వ్యవస్థగ ఉండదు. నిలబడగలది ఆర్థిక వ్యవస్థ ఉత్పత్తుల అమ్మకం కొనుగోలు వీటి నాణ్యత స్వచ్ఛతలపై ఆధారపడి ఉండాలి తప్పించి దేశీయాభిమానం జాతీయాభిమానం వీటికి మార్కెట్టు విలువప్రక్షి తెచ్చిపెడతాయనటం నమ్మకమే తప్ప ఆర్థిక సూత్రంగ నిలవదు ఆర్థిక వ్యవస్థ పని చేస్తుంది పని చేయించిన ఇది పాడవుతుంది.

మితిమీరిన రాయితీల్ని సబ్సిడీల్ని ఇచ్చిన ఏ రంగంలో కొనసాగించిన చివరికిది దేశ ద్రవ్య వ్యవస్థలో బలహీనతలకు చోటునిస్తాయి. ఉత్పత్తి శక్తులు భూమి శ్రమ పెట్టుబడి యాజమాన్య శక్తి వాటికవి పుంజుకొని స్వీయాధిక్యతల్ని వాటికవి నిలుపుకోవాలి తప్పించి వాటిని మనం నిలబెట్టిన అవి నిటారుగ నిలవవు వెలకిలపడతాయి రంగుపూసిన, వస్తూత్పత్తి సేవలకు ఎన్నాళ్ళు వెలకట్టి అమ్మగలం బయటపడిన అసలకు భంగం అసలు వడ్డీ లేనిదే ఆర్థిక వ్యవస్థకు ఆకారమే ఉండదు. అసలు అనేది శ్రమగ ఉండాలి. వడ్డీ అనేది శ్రమ విలువగ ఉండాలి. ఒకరి శ్రమకు తన అసలుగ ఉండరాదు. ఒకరి శ్రమ విలువ తన వడ్డీగ జమ చేసికోరాదు.

## 9వ ప్రకరణం

## జారీపత్రం-అనుమతి-నియంత్రణ-తనిఖీ

### రాజకీయ సార్వభౌమాధికారం ఒకరిది గుత్తాధిపత్యం ఒకరిది:-

నియమనిబంధనల మేరకు సంయమైన రాజ్యాధైన ఎవరికి వ్యక్తి అయిన సరసక తప్పదు మితి మీరిన రాగలది దుష్పరిణామమే. ప్రభుత్వానికి జారీ పత్రం విడుదల చేయగలిగిన రాజకీయ శక్తి కలది. అనుమతిని ఇవ్వగల సామాజిక అవసరం కలది. నియంత్రణ పరచగల అవసరం కలది, తనిఖీ చేయగల సత్తాకలది.

వీటిని విడనాడిన ''ప్రభుత్వం'' రాజ్యాధికారం కలిగిన ప్రభుత్వమంగ నిలవలేదు. వీటిని అంతము చేయాలన్న రాజ్యాన్ని అంతరింపచేయుడమే అవుతుంది. కేవలం సార్వభౌమాధికారమే వీటిని అమలుపరచగలదు. ఏ ఇతర అధికారం వీటిని అమలుపరచలేదు. వీటి వలన నిరంకుశ పాలనకు అవినీతికి ఆశ్రిత పక్షపాతానికి ప్రభుత్వం గురికావడం జరగదు వీటిని అక్రమపద్ధతిలో సక్రమపద్ధతిలో కాకుండా దుర్వినియోగ పరచిన రాజ్యమున శాంతి భద్రతలకు విఘాతం కలిగిస్తాయి.

అదుపు ఆజ్ఞల్ని కలిగిన ప్రభుత్వం లోకువ లొంగుబాటులనేవి సమాజంలో లేకున్న వీటిని అమలుపరచలేదు. అవినీతిని అశాంతిని అదుపు ఆజ్ఞల్ని ప్రభుత్వం జారీ చేయకుండ వీటిని తొలగించలేదు.

పబ్లిక్‌సెక్టర్ ప్రైవేట్‌సెక్టర్ పరస్పర విరుద్ధ ప్రయోజనాల్ని కలిగి పనిచేస్తాయి. రాజకీయ సార్వభౌమాధికారం ఒకరిది గుత్తాధిపత్యం ఒకరిది. ఒక రంగం వేరొక రంగాన్ని ఆక్రమించుకోవాలని సహజంగ అర్రులు చాస్తుంది. ఉమ్మడి సౌభాగ్యానికి ఒకరు వ్యక్తిగతలాభాలకు ఇంకొరు శ్రమించి కృషిసలుపుతారు. వీటి మధ్య సమతౌల్యం తెచ్చి ప్రజా ప్రయోజనాల్ని రక్షించవలసిన ప్రధాన బాధ్యత రాజ్యముపై ఉంది.

### సాంఘిక శ్రేయోరాజ్య నిర్మాణానికివి సోపానాలు:-

ఇందుకు ప్రజాప్రయోజనాల పరిధిలో ఈ రెండు రంగాలు నడవటానికి ప్రభుత్వం చేతిలో జారీ పత్రం నియంత్రణ తనిఖీలుండాలి. ప్రజల ఆశయాల్ని అభిలాషల్ని అణచటానికివి గాక ప్రజా రాజ్యస్థాపనకు సాంఘిక శ్రేయోరాజ్య నిర్మాణానికివి సోపానాలు ప్రైవేట్ పబ్లిక్‌రంగాల్ని సమతూకంలో నడిపించ గల సమగ్రమైన ఆర్థిక పరిపాలనా విధానాలివి తప్ప ప్రజా రాజ్యాన్ని వంచించే సాధనాలుగ ఉండవు. పోటీ మార్కెట్ ఆర్థిక వ్యవస్థకు స్వైర విహారం చేయకుండ అడ్డగల దిట్టలు ఇవి కట్టుబాటుల్ని క్రమశిక్షణ ల్ని అందించగలవి.

**దేశీయ(స్వదేశీ) సరళీకృత ఆర్థిక విధానం నూతన సరళీకృత ఆర్థిక విదానము:-**

ఉదార ఆర్థిక విధానాలని దరిమిలా వ్యాప్తి చేయబడుచున్నవి. సామ్యవాద ఆర్థిక వ్యవస్థగల చైనా రష్యాలో కూడ ఉదార ఆర్థిక విధానాల పేరిట నూతన ఆర్థిక సంస్కరణలని సోషలిష్టు ఎకనమీ సాధకులు తీర్చిదిద్దుతున్నారు. చివరకు ఈ దరిమిలా కమ్యూనిష్టు ఆర్థిక వ్యవస్థ గల చైనాలో కూడ పరిమిత వ్యక్తిగత ఆస్తులకు రాజ్యాంగ రక్షణలను ఇచ్చారు. సోషలిష్టు ఎకనమీ గాక సోషలిష్టు మార్కెట్ ఎకనమీ మార్గాలు ఏర్పడుతున్నాయి. సోషలిష్టు ఎకనమీకి సొంతదారులు మూసికొని పోతున్నాయి.

స్వేచ్ఛా మార్కెట్ ఆర్థిక విధానంలో కూడ ఉదార ఆర్థిక విధానాలని ఫ్రీమార్కెట్ ఎకనమీకి కొన్ని చేర్పులు మార్పులు చేపడుతున్నారు.

చివరికి మిశ్రమ ఆర్థిక విదానం సోషలిష్టు మార్కెట్ ఆర్థిక విధానం చేపట్టిన ఇండియా కూడ నూతన సరళీకృత ఆర్థికవిదానాలకు అంకురార్పణ చేసింది. మిశ్రమ ఆర్థిక విధానానికి ఈ దేశం ముగింపు పెట్టలేదు.

అయితే నూతన సరళీకృత ఆర్థిక విధానము దేశీయ పరిమిత సరళీకృత ఆర్థిక విధానము ఒకటి కావు. ఒకే నాణేనికి ఇరువైపులగల బొమ్మ బొరుసులు వంటివి. ప్రపంచ పోటీ మార్కెట్ వ్యవస్థను తట్టుకొని నిలువగలుగుటకు ప్రయత్నిస్తుంది. నూతన సరళీకృత ఆర్థిక విదానం ఈ విధానం స్వదేశీ ఆర్థిక విధానమనిన చెల్లదు.

ఏ ప్రభుత్వం ఇందులో ఏదో ఒక విధానానికే పరిమితం కావాలి తప్ప ఈ రెండింటిని పట్టి నడవటానికి ప్రయత్నించిన అది జోడు పడవల ప్రయాణం. ఒడ్డున చేరేది ఉండదు. విదేశీ స్వదేశీ పోటీ మార్కెట్ ఎకనమీని విడనాడటం ఆర్థిక సత్యాన్ని సూత్రాల్ని విస్మరించి మాట్లాడమే అవుతుంది.

**ప్రపంచ భౌగోళీకరణ:-**

భూమి-శ్రమ-పెట్టుబడి-యాజమాన్యశక్తి- ఉత్పత్తి శక్తులవి వేటిని దేశీయ విదేశీయ నబంధనలు కట్టడి చేయలేవు. మానవతకే మెరుగులు దిద్దగల ఉత్పత్తి శక్తుల యాజమాన్య శక్తుల సకల మానవాళి ఆర్థిక సంస్థలు వికాసానికే విజృంభించి ముందుకు సాగగలవు అని కొందరి భావన.

ఇందుకు దశల వారిగ గ్లోబలైజేషన్‌లో (ప్రపంచ భౌగోళీకరణ) మనం చేరాలనడం కుదరదు. అంతర్జాతీయ మార్కెట్‌లో ప్రవేశం జరగాలే గాని అది ఒక్కమారే జరుగుతుంది. దశల వారిగ లభించేది కాదు గుర్రం పందాలలో మన గుర్రం చేరాల వద్దన్నది దశల వారిగ జరిగే పని కాదు. ఒకే మారు జరిగేది ఈనాడు స్వదేశీ విదేశీ పెట్టుబడులు వినా దేశ ఆర్థిక వ్యవస్థ కొనసాగటానికి అవకాశమే లేనే లేదు.

## 10 వ ప్రకరణం
## ప్రణాళిక ఆర్థిక సంఘం- ప్రజాపంపిణీ వ్యవస్థ

**సంక్షేమ ఆర్థిక విధానాలుండాలి:-**

ఏ ఆర్థిక విధానం ఉత్తమమైనది అని ప్రశ్నించిన రాగల జవాబు ఏది మన జీవన స్థాయిని ప్రమాణాల్ని పెంచి ఆర్థిక జవసత్వాల్ని మనకివ్వగలదో ఆ ఆర్థిక విధానమే మంచిది. జన సామాన్యం జీవన ప్రమాణాల్ని పెంచగలవి ప్రణాళిక ఆర్థిక విధానం ప్రజాపంపిణీ వ్యవస్థ కొనుగోలు శక్తిలేని వారికి సబ్సిడీల్ని రాయితీల్ని అందించే ఆర్థిక విధానం ఉండాలిదేశ వనరులను వినియోగ పరచగల ప్రణాళికాబద్ధమైన విధానాలుండాలి. అల్పాదాయ వర్గాల వారికి సంక్షేమ ఆర్థిక విధానాలుండాలి. అందులో ఒక విధానమే ప్రజా పంపిణీ వ్యవస్థ పోటీ మార్కెట్ నుండి జీవనావసర ఉత్పత్తిల్ని తప్పించి లాభనష్టాలు లేని సబ్సిడీ రేట్లపై సాధారణ జనాలకు అందించడమే ప్రజాపంపిణీ వ్యవస్థ ధ్యేయం.

స్వేచ్ఛా మార్కెట్ ఎకనమీ ఒక వైపు సామ్యవాద ఆర్థిక వ్యవస్థకు ప్రతిరూపాలుగ నిలువగల పబ్లిక్‌రంగం ఒకవైపు ఉండగ ప్రణాళిక సంఘం ప్రజాపంపిణీ వ్యవస్థ ఆవశ్యకత ఉంటుంది. స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానమున ఇవి ఇమడ లేనివి సామాన్య జన జీవన ప్రమాణాల్ని పెంచ తగిన ఉత్పత్తుల పెరుగుదలకు ఇవి ఊపిరిగ నిలుస్తాయి.

రాయితీల్ని సబ్సిడీల్ని ఇతర మౌళిక సదుపాయాల్ని జనావళికి అందించగల ఆర్థిక వ్యవస్థను కలిగి ఉండగలది సోషలిష్టు మార్కెట్ ఆర్థిక విధానం స్వదేశీ పరిమిత మార్కెట్ ఎకనమీలో ఇవి సిద్ధించవు ఇందుకు స్వదేశీ ఆర్థిక వ్యవస్థ తట్టుకొని నిలువలేదు.

**భూకమతాలకు పరిమితులు- భూసంస్కరణ లు:-**

సకల ఆదాయాలకు మూలం భూమి వ్యవసాయకోత్పత్తుల వినా మానవునికి ఉనికి లేదు. మనుగడ కొనసాగదు కూడు గుడ్డల నీడ భూమికి పరిమితులు విధించి మిగులు భూమిని భూమిలేని నిరుపేద శ్రామికులకు పంచిపెట్టిన ఉభయతారకంగ ఉంటూ ఒక వైపు వ్యవసాయ కూలీలకు స్వతంత్ర్యముగ జీవించే అవకాశం. మరొక వైపు అధికోత్పతలకు ఆస్కారం కలుగుతుంది. అధిక పాడిపంటలకు నిలయమైన భూమిని పరిమిత వ్యక్తుల పరముగనే ఉంచిన అపరిమిత పేద బీద ప్రజల కష్టఫలితాల్ని భూములన్న వారు దోచుకోవటానికి ఆస్కారం ఉంటుంది. పెట్టుబడిదారులు అవసరం అంటుంది. ప్రైవేట్ సెక్టరు శ్రమ జీవులకు రక్షణ అంటుంది పబ్లిక్ సెక్టర్.

## వ్యవసాయరంగంలో అనేక నూతన మార్పులు :-

స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం భూములను వ్యవసాయ భూములుగనే ఉండాలని అంటుంది. పారిశ్రామికంగ భూములను వినియోగించటానికి అడ్డుపడుతుంది. భూమికతాల పరిమితులకు అంగీకరించదు. భూసంస్కరణలు జరిగిన ''భూస్వామ్య విధానం'' అంతరించి ''భూయాజమాన్య విధానం'' వస్తుంది. సాగుల ధికోత్పత్తుల వలన ఆధునిక శాస్త్రీయం సాంకేతిక విధానాల వలన వ్యవసాయరంగంలో అనేక నూతన మార్పులు చోటు చేసికుంటాయి. రైతాంగం జీవన ప్రమాణం పెరుగుతుంది ఆర్థిక శక్తిపెరిగినరైతాంగం ఆలోచిస్తుంది. ఆలోచన మంచి చెడుల సమీక్షను చేయగలది ఉంటుంది. పాత సాంప్రదాయ పద్ధతులకు వీడ్కోలిచ్చి నూతన పద్ధతులకు విధానలకు స్వాగతిస్తుంది.

దున్నే వానిదే సాగుహక్కు పట్టా ఉన్న వానిదే భూమి హక్కు ఏర్పడతాయి . పొదుపు సంపాదనలు గూడు కట్టుకుంటాయి. పరిమిత వ్యవసాయకోత్పత్తులకు స్వీయ వినియోగపడు ఉత్పత్తి పద్ధతులనుండి బయటపడి రైతాంగం లాభనష్టాల మేరకు అధికాహారోత్పత్తుల్ని సాదిస్తూ సంకుచిత పరిధిగల మార్కెట్ ఆర్థిక వ్యవస్థ అధిగమించి దేశ విదేశీ ఆర్థిక వ్యవస్థలో భాగస్వామిగ నిలుస్తారు. స్వదేశీ సరళీకృత ఆర్థిక విధానం సంకెళ్ళ నుండి విడివడతారు. ఉదార ఆర్థిక విధానాల్ని పేద బీద ప్రజలకు అనుసంధానం చేస్తూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీ పరుగులు తీస్తుంది.

## భుక్తి కోసం భూమి ముఖ్య భూమిక :-

స్వదేశీ పరిమిత ఆర్థిక విధానం పేరిట మరల భూస్వామ్య విదానాల్ని అమలు జరిపి హక్కు భుక్తాల్ని భూములపై ఇవ్వటానికి ఆధునిక సాంకేతిక జగతి అంగీకరించదు. భుక్తి కోసం భూమి ముఖ్య భూమిక వహించాలి. తప్ప ఒకరి హక్కు భుక్తం కోసమే భూమి నిలపటానికి లేదు. కారణం సర్వజన భుక్తి ప్రదాయిని భూమి సకల జన శక్తి ప్రధాత భూమి భూమిపై ఏ ఒకరికి హక్కు పరిమితమైనదిగ ఉండాలి. దేశ ఆర్థిక వ్యవస్థలో ఇండియా వ్యవసాయ రంగంలోనే అధిక స్థాల జాతీయధాన్యాన్ని సంపాదించి పెడుతుంది. వ్యవసాయరంగంలో దేశంలో పల్లె ప్రాంతాల్లో 75% ప్రజలు జీవితాల్ని కొనసాగిస్తున్నారు. ఇటువంటి భూమిపై సర్వాధికారాల్ని ప్రభుత్వమే కలిగి ఉండాలి. అందుకే భూసంస్కరణల్ని చేసి భూమికి పరిమితులు విదించి మిగులు భూమిని భూమిలేని నిరుపేదలకు పంచిపెట్టగలిగింది. నెహ్రూ- ఇందిర-కాంగ్రెస్.

## స్వదేశీ మార్కెట్ ఆర్థిక విధానం-మనల్ని ఆదుకోగలదా!

దేశీయ వనరుల సద్వినియోగం దేశంలో ప్రభుత్వ పెట్టుబడుల సమీకరణ జరిగినపుడే సాధ్యం పరిమిత మార్కెట్ ఆర్థిక వ్యవస్థ వలన ప్రజాపెట్టుబడులు పొదుపు వర్ధిల్లదు. ప్రభుత్వం వ్యయంలో కోత విదిస్తే వ్యక్తుల ఉత్పాధికత నశిస్తుంది. రెవెన్యూ వాటా తగ్గించి పన్నులు వేసిన వ్యక్తులు కొనుగోలు శక్తిని హరించినట్లు అవుతుంది. ప్రభుత్వరాయితీల్ని సబ్సిడీల్ని తగ్గించిన సాధారణ జనావళిలో చొరవ ఉత్సాహం సన్నగిల్లుతు చివరికి ఫలితం ఆర్థిక మాంద్యం స్వదేశీ విదేశీ ఆర్థిక ఆంక్షలు ఊబినుండి బయట పడాలన్న దేశీయ ఉత్పాదికత శక్తి సామర్థ్యం బాగా వ్యక్తపడాలి దేశ ఆర్థిక వ్యవస్థను దివాళా తీసే అనుత్పాదిత వ్యయాన్ని తగ్గించుకోవాలి.

## సోషలిష్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థ:-

ఇందుకు సోషలిష్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థ తప్ప స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం సరిపోదు కారణం స్వదేశీ మార్కెట్ వ్యవస్థలో అనుసరించగల పోటీ వస్తూత్పత్తి సేవల విలువల్ని వస్తునాణ్యతల్ని పెంచి పెద్ద జేయలేదు అధికోత్పత్తుల్ని సాదించలేదు. ఎంతచెట్టుకి అంతగాలి. ఇందులో సరిసమానమైన ఉత్పత్తి పద్ధతుల్ని క్రమబద్ధీకరణను చేపట్టిన స్వదేశీ మార్కెట్ స్థాయి పోటీ తప్ప అంతర్జాతీయ మార్కెట్ స్థాయి పోటీ ఉండదు. వస్తు నాణ్యత ఉత్పాదికత శక్తి ఎలా సంభవిస్తాయి. పరిమిత మార్కెట్ వ్యవస్థ ఫలితాలు అంతంత మాత్రమే అపరిమిత మార్కెట్‌లోనే అత్యధిక లాభాపేక్షక అవకాశం ఉంటుంది. ఉత్పత్తి శక్తులు యాజమాన్య శక్తులు పెద్ద స్థాయిలో నడచిన పెద్దపెద్ద ఆర్థిక ప్రయోజనాల సిద్ధిస్తాయి.

## అసమానతల్ని రూపు మాపగల ఆర్థిక వ్యవస్థ అవసరం:-

ఆర్థిక వ్యవస్థలో చోటు చేసికున్న అసమానతలను కేవలం సోషలిష్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థలోనే సరిజేయబడతాయి. పనిసామర్థ్యం వృత్తినైపుణ్యం ఆర్థిక పెట్టుబడులను వ్యక్తులకు కలుగజేయగల దీటైన ఆర్థిక వ్యవస్థగలది నెహ్రూసోషలిజం. **సరిసమానతలు కలుగజేయుడమన్న సరిసమాన ఆదాయ వ్యయాల్ని సర్వులు కలిగియున్నట్లు జేయుడమేమి కాదు. సరిసమాన అవకాశాల్ని సర్వులు అందేటట్లు జేయుడమే సమసమాజ వ్యవస్థలో సిద్ధంచగలది ఇదే.**

పని సామర్థ్యం మేరకు జీవన భృతి పొందేస్థితి నుండి జీవన సౌకర్యాల మేరకు వేతనాల్ని అందరూ అందుకొనేస్థితి సామ్యవాద ఆర్థిక స్థితి దీనిని అందుకోగలగడంలో రష్యా చైనాలో నేటికి చేతల్లో గత వందేండ్లుగ ఈ ఆర్థిక వ్యవస్థ నడచిన ఫలవంతమైన సామ్యవాద (Socialism) ఆర్థిక వ్యవస్థ ప్రపంచంలోనే నేడు ఏ దేశాన చోటు చేసికోలేదు.

సమాజ అవసరాల్ని తీర్చటానికి సంక్షేమ ఆర్థిక విధానం వ్యక్తులోగల ప్రతిభా సామర్థ్యాలకు తగిన పారితోషికాలు లభించటానికి మిశ్రమ ఆర్థిక విధానం అవసరం. స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానంలో ప్రతిభా సామర్థ్యాలున్న వారు బాగుపడతారు. అమితాదాయాల్ని అందగలరు. అమిత వ్యయం చేయగల శక్తి వంతులుగ నిలుస్తారు. మిగిలిన వారు అవివేక బలహీనులు అల్పాదాయవర్గాలుగనే నిలిచిపోతారు. సామాజిక న్యాయం సంతకు వెళ్తుంది.

**సాంఘిక సంక్షేమ పథకాలకు నిధుల్ని వెచ్చించాలి:-**

కేవలం జీవన సంస్కృతి నుండి ఉత్పత్తులలో నాణ్యత సాధ్యం తప్ప శ్రమ సంస్కృతి పేరున వస్తూత్పత్తి సేవలు పెంపుదలను వృద్ధిపరచలేం. గట్టిపోటీ స్పర్థలు లేనిదే అభివృద్ధి ఎందులోను కన్పించదు. కేవలం జాతీయ భావం కలిగి ఉన్నంత మాత్రాన మన జరుగుబాటులలో గల పట్టువిడుపులు మనకు లభించవు. ఆచరణలో వీటిని మనం మన పని సామర్థ్యం వృత్తి నైపుణ్యం ద్వారానే అందుకోవాలి. ప్రభుత్వ ప్రమేయం కాస్తోకూస్తో అంతోకొంతో లేకుండ ఉత్పత్తి శక్తుల్ని అదుపు ఆజ్ఞల నిడటం సాధ్యం కాని పని ఉత్పత్తి శక్తుల్ని యాజమాన్య శక్తుల్ని రెండింటిని అదుపు ఆజ్ఞలలో గలది సోషలిష్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థే అని మరచిపోరాదు.

వ్యక్తుల పనిపాటలకు తను సరియైన ప్రతిఫలాన్నిస్తూ దేశం తన వద్ద మిగిలినదే తన ఆదాయంగ ఉంటుంది. దేశాదాయం సామాజిక పంపిణిలో సమానత్వం పొందించాలంటే సరిపోదు. ఈ పంపిణి ముందుగ వెనుకబడిన దగాపడిన దళితుల మధ్య జరగాలి. అవివేక బలహీనులను సంరక్షించే సాంఘిక సంక్షేమ పథకాలకు వెచ్చించాలి.

ప్రతి ఒకరి చేతికి పని దొరకాలని పాత తరం పనిముట్లను ఆదరణ అంటూ అందజేసిన ఫలితముండదు. నిత్య శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానంలో ఉత్పత్తి సాధనాల్లో మార్పులు వస్తున్న ఉత్పత్తి పద్ధతులలో చేర్పులు సంభవిస్తున్నాయి**చేతులకు దొరికే పనులకు బదులుమెదడకు లభించే పనులు వృత్తులు బాగా పెరిగిపోతున్నాయి.** ఇందుకు తగిన ఆర్థిక వ్యవస్థ విరజిల్ల గలది. నెహ్రూ సోషలిజం ధ్యేయం సామ్యవాద తరహా సమాజ నిర్మాణమే సంక్షేమ రాజ్యసాధనకు నెహ్రూ సోషలిష్టు మార్కెట్ ఎకనమీ మార్గ దర్శకంగా నిలుస్తుంది. శ్రేయోరాజ్య స్థాపనకు నాంది ప్రస్తావన ఇది.

**ఉమ్మడి ప్రయోజనం సమిష్టితత్వం పెరగాలి :-**

దేశ శ్రేయస్సు-సమాజాభివృద్ధికి అభ్యుదయానికి కేవలం "ప్రైవేటీకరణ" అని పాట పాడిన సరిపోదు. దీనికి తారక మంత్రంగ జపించిన ఫలితమంతంత మాత్రమే

అభివృద్ధి రేటు పెరగదు. అలానే పబ్లిక్‌రంగం ఈదేశాన్ని ఉద్దరించగలుగుతుంది. అన్నది సరికాదు. ఒక ఆర్ధిక విధానంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యంతో పాటు దోపిడీ పీడనలున్నాయి. మరొక ఆర్ధిక విదానంలో ఉమ్మడి ప్రయోజనం సమిష్టి తత్త్వంతో పాటు అణచివేత నిరంకుశ విధానాలున్నాయి. కర్తవ్యం ఏమిటి? దేశానికి దిక్సూచి ఏమిటి కేవలం ఈ రెండింటిని సమైక్యపరచగల నెహ్రూ సోషలిజం సోషలిస్టు మార్కెట్ ఆర్ధిక విదానమే శరణ్యం శిరోధార్యం.

ప్రభుత్వరంగం ప్రైవేట్‌రంగం మౌళిక సదుపాయాలు కల్పనకు సమ ఉజ్జీగ సజీవముగ జవసత్వాలుతో నడచినపుడే నిర్దేశిత అభివృద్ధి రేటును ఏ దేశ ఆర్ధిక వ్యవస్థ అయిన సాధించగలదు.

భారత దేశం నేడు అనేక సమస్యలతో సతమతమౌతోంది. 21వ శతాబ్దంలో అడుగిడుతున్న సమయంలో జనాభాలో 30% మందికి అంటే 30 కోట్లు మందికి సరియైన కూడు గుడ్డ వసతి సౌకర్యాలు ఇప్పటికి అందలేదు. దేశ సంపద పంపిణీలో మనం అసమానతల్ని ఎదుర్కొంటున్నాం. సామాజిక న్యాయ సాధనలో వెనుకబడి ఉన్నాం. అతి తక్కువ తలసరి ఆదాయం దేశంలో అక్షరాస్యులు నేటి 52% కి మించలేదు. భూ సంస్కరణల్నిసరిగ అమలు పరచుకోలేకపోతున్నాం. గ్రామీణ ప్రాంతాలలో ఇప్పటికి సరియైనవైద్య ఆరోగ్య సదుపాయాలు కొరత తీవ్రంగ ఉంది. గ్రామప్రాంతాల్లో గ్రామీణ భారతిలో 68% బాలికలు ఇప్పటికి స్కూలు మొఖం చూడని వారే మానవాభివృద్ధి నివేధికలో ఈ విషయాల్ని తెలిపారు. నిరుద్యోగ అక్షరాస్యులకు ప్రభుత్వం వారి చదువులకు దీటుగ ఉపాది అవకాశాల్ని కల్పించలేకపోతున్నది. శాస్త్రీయ సాంకేతిక విజ్ఞన రంగాల్లో మనం ఎంతగానో వెనుకబడి ఉన్న మన దేశ ఆర్ధిక వ్యవస్థ బలహీనంగనే ఉంది.

## నెహ్రూ సోషలిజం - దేశానికి దిక్సూచి:-

అయితే ఇందుకు పరిష్కార మార్గం మార్గాంతరం ఏమిటి కేవలం ఒకే ఒక మార్గం ఉంది. నెహ్రూ సోషలిజం. సోషలిస్టు మార్కెట్ ఆర్ధిక విధానము ఈ దేశములో అమలు కావాలి. ఇందిర 20 సూత్రాల ఆర్ధిక ప్రణాళిక అవసరం. సామ్యవాద తరహా సమాజ నిర్మాణానికి తగిన చర్యలు తీసికోవాలి. పెరిగిపోతున్న పెట్టుబడి దారుల ఆదాయాలకు అడ్డకట్టలు వేయాలి తరిగిపోతున్న శ్రామికుల జీవన ప్రమాణాల్ని పెంచుకోవాలి:

మన సమాజ నిర్మాణం మనదేశ మాజీ ప్రధాని నవభారత నిర్మాత జవహర్‌లాల్ నెహ్రూ ఆశించిన రీతిని జరగాలి మనదేశానికి దిక్సూచి ముమ్మాటికి నెహ్రూ

సోషలిజమే స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం ఎంత మాత్రం మన దేశ ఆర్థిక వ్యవస్థలకు పరిష్కార మార్గముగ నిలవదు నిలవగలది. దేశ ఆర్థిక వ్యవస్థ బలోపేతనం చేయుగలది కేవలం నెహ్రూ సోషలిజం మనకు శరణ్యం శిరోధార్యం.

డు స్వావలంభన అంటే ఒకనాడు వలె తనదైన తరహాలో తన చుట్టూ గిరు గీసికొ. వస్తూత్పత్తి సేవలో పాల్గొనడం కాదు. ప్రపంచ మార్కెట్‌లో ఇతర మిగతా దేశాల పోటీకి తట్టుకొని విలబడు వస్తునాణ్యత నైపుణ్యంగల వస్తూత్పత్తి సేవలతో నిమగ్నమవటం ఒకనాడు వలె స్వావలంభన అంటే కేవలం స్వయం సమృద్ధి మాత్రమే కాదు. ఉన్నత స్థాయి సాంకేతిక పరిజ్ఞానాన్ని అత్యధిక స్థాయిలో సముపార్జించుకోవటం. ఇటువంటి ''స్వావలంభన''ను దేశీయ ఆర్థిక వ్యవస్థలో స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విధానం వలన సాధించగలమనుటకోవటం భ్రమ మాత్రమే. ఇందుకు సోషలిష్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థను మనం రూపొందించు కొననిదే మన దేశీయ ఆర్థిక వ్యవస్థను సుస్థిర పరచుకోలేం. 21 వ శతాబ్దంలోనికి దేశాన్ని తీసికొని పోలేము సురక్షితముగా.

''ప్రభుత్వస్వామ్యం''ను మనం కాదనలేము. మార్కెట్ స్వామ్యమును మనం లేదన లేము. మార్కెట్ కేపటిలిజం వైపు మనం మరలిన తటస్థించగలది. ఆర్థిక మాంద్యం సోషలిష్టు మార్కెట్ వైపు మనం మరలిన ఎదురవ గలది ద్రవోల్బణం ఇందువలన-

''మార్కెట్ కేపటిలిజమ్''లో సమాజాభివృద్ధికి స్వదేశీ విదేశీ పెట్టుబడులే పెట్టనికోటలని, భ్రమిస్తున్న బాబుల ఆర్థిక విధానంగాని, స్వదేశీ పరిమిత మార్కెట్ ఆర్థిక విదానమే, మనదేశ ఆర్థిక వ్యవస్థ బాగుపరచగలదని భ్రమిస్తున్న పెద్దల స్వదేశీ ఆర్థిక విదానము గాని ఈ రెండింటిలో ఏ ఒకటి దేశానికి రవ్వంత కూడ మేలు చేయని ఆర్థిక విధానాలే అందువలన శ్రేయోరాజ్యస్థాపనకు శ్రేష్టమైన ఆర్థిక విదానం నెహ్రూసోషలిజం స్వదేశీ మార్కెట్ ఎకనమీ కాదు.

మధ్యే మార్గమే ఎన్నడు మనకు- మార్గ దర్శకంగ నడవాలి
సోషలిష్టు మార్కెట్ ఎకనమీ సాధనే - మన ధ్యేయంగా ఉండాలి
సామ్యవాద తరహా సమాజ నిర్మాణమే - మన లక్ష్యంగా నిలవాలి

ప్రజాకవి - వంగపండు
పెందుర్తి
విశాఖ - ఉత్తరాంధ్ర



ప్రజాకవి - వంగపండు రచించిన గ్రంధమును
విడుదల చేస్తున్న కాంగ్రెస్‌పార్టీ అధ్యక్ష -ఉపాధ్యాక్షులు
DR.Y.S. రాజశేఖర రెడ్డి, ద్రోణం రాజు సత్యన్నారాయణ